శాస్త్రవిజ్ఞానము, చరిత్ర తెలుగు అకాడమీ ప్రచురణము 4

# మన పార్లమెంటు

శ్రీ మాడభూషి అనంతశయనం అయ్యంగారు
లోకసభ స్పీకరు

ఉపోద్ఘాతము :

శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారు
స్పీకరు, ఆంధ్రప్రదేశవిధానసభ

ప్రకాశకులు :

అజంతా పబ్లికేషన్సు
సికింద్రాబాదు
1959

# తొలిపలుకు

శాస్త్ర విజ్ఞానము, చరిత్ర తెలుగు అకాడమీ పక్షమున చతుర్థ పుష్పముగా **మన పార్లమెంటు** అను నీ గ్రంథమును ఆంధ్ర మహాజనుల కర్పించుచున్నాము.

రాజ్యాంగ విజ్ఞాన పారంగతులును, రాజనీతి చతురులునగు మన భారతదేశ లోకసభ స్పీకరు **శ్రీమాన్ మాడభూషి అనంతశయనం అయ్యంగారు** తాము ఆంగ్లమున రచించిన Our Parliament అను గ్రంథమును అకాడమీ పక్షమున తెలుగున ప్రచురించుటకు అనుమతించుట మన భాగ్యవిశేషము. దానిని ఉత్తమ రాజనీతిజ్ఞులగు **తెన్నేటి విశ్వనాథముగారు** సరళముగా అనువదించి యిచ్చినారు. మూల లేఖకులకును, అనువాదకులకును మా హార్దిక కృతజ్ఞతలు.

ఈ గ్రంథమునకు విజ్ఞానపూర్ణమైన యుపోద్ఘాతము వ్రాసి, అందు మన యాంధ్రప్రదేశ విధాన సభనుగూర్చి వివరించి పాఠకులకు కేంద్ర, రాజ్య విధాన సభలను గూర్చిన పరిపూర్ణ పరిజ్ఞానము గలుగుటకు అవకాశము గలిగించిన ఆంధ్రప్రదేశ విధానసభ స్పీకరు **శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు పంతులుగారికి** మా హార్దిక కృతజ్ఞతలు.

ఈ కాగితము కరవు రోజులలోగూడ విజ్ఞాన ప్రచారమునందలి ప్రగాఢ వాంఛతో మా అకాడమీ తలపెట్టిన ప్రచురణములను ముద్రించి ప్రకటించుటకు కొందఱు ప్రకాశకులు ముందంజవేయుట ముదావహము. ఈ గ్రంథమును ముద్రించి ప్రకటించిన **అజంతా ప్రింటర్స్, అజంతా పబ్లికేషన్సు** యజమానులగు శతావధానులు **శ్రీ శ్రీనివాస సోదరుల** యుత్సాహపూర్ణమగు సహకారమునకు మిక్కిలి కృతజ్ఞతలు.

హైదరాబాదు
**5-8-1959**

పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు
కార్యదర్శి
శాస్త్ర విజ్ఞానము, చరిత్ర తెలుగు అకాడమీ

## విషయసూచిక



4

# ఉపోద్ఘాతము

సుప్రసిద్ధ దేశనాయకులు, లోకసభ స్పీకరు నగు మాన్యశ్రీ అనంతశయనం అయ్యంగారు 'మన పార్లమెంటు' అను ఉద్గ్రంథమును ఆంగ్లమున రచించినారు. దానిని ఆంధ్రనాయకులు తెన్నేటి విశ్వనాథంగారు తెలుగులోకి తర్జుమా చేసినారు. దానిని శాస్త్రవిజ్ఞానము, చరిత్ర తెలుగు అకాడమీవారు ప్రచురించుచున్నారు. మన రాజ్యాంగ సంవిధానము, పార్లమెంటు, అది పనిచేయుచున్న పద్ధతులు, మన రాజధానినగరము, అందులోని మన పార్లమెంటు భవనములు. ఈ విషయములను గూర్చి వ్రాయుటకు డిప్యూటీ స్పీకరుగను. స్పీకరుగను మన స్వతంత్రభారత పార్లమెంటులో ప్రధాన సభ అయిన లోకసభపై ఆధిపత్యము వహించి ఎనిమిది సంవత్సరములనుంచి బహు సమర్థతతో నడుపుచున్న శ్రీ అయ్యంగారికంటె శ్రేష్ఠులు మన దేశములో మరియొకరు లేరనుట నిస్సంశయము. సామాన్యజనులకును, బాలబాలికలకును సుబోధ మగునటుల నతి సులభశైలిలో సంభాషణారూపకముగ దీనిని శ్రీ అయ్యంగారు వ్రాసినార్యు దానికి తోడుగ మన రాజ్యాంగ సంవిధానము యొక్క స్వరూప స్వభావములను గూర్చిన కొన్ని ముఖ్యాంశములు ఉపోద్ఘాతములో వ్రాయుట సమంజసమని తోచి నే నీ యుపోద్ఘాతమును వ్రాయ సమకట్టినాను.

మహాత్మాగాంధి నాయకత్వముక్రింద మన దేశీయులు జరిపిన స్వతంత్ర పోరాట ఫలితముగ ఆంగ్లేయులు నేషనలు కాంగ్రెసు నాయకులతో రాజీ చేసుకున్నారు. 1947 సంవత్సరపు ఇండియా స్వతంత్ర చట్టము ననుసరించి బ్రిటిషుపార్లమెంటువారు ఇండియా

నుండి పాకిస్తానమును వేరుచేసినారు. ఇండియాకును. పాకిస్తానము నకును 1947 సంవత్సరము ఆగష్టు నెల 15 వ తేదీన ఆస్ట్రేలియా, కెనడా, దక్షిణాఫ్రికా, న్యూజిలాండు, దక్షిణ ఐర్లాండు దేశములకు వలె డొమినియను ప్రతిపత్తిని కలుగజేసినారు. ఆంగ్లేయ పార్లమెంటుకు ఆంగ్లదేశ పాలనలో సంపూర్ణాధికార మున్నటులే, 1946 సంవత్సరములో ఇండియా ప్రజ లెన్నుకొనిన ఇండియా (భారత) పార్లమెంటుకు ఇండియాదేశపాలనలో సంపూర్ణాధికార మొసంగబడినది. గాని బ్రిటిషు రాజుగారే మిగిలిన డొమినియనులకు వలెనే మన దేశముపైన కూడ రాజుగ నుండి శ్రీమాన్ చక్రవర్తి రాజగోపాలాచార్యులవారిని మన దేశముపై గవర్నరు జనరలుగ నియమించిరి. నూతన రాజ్యాంగ సంవిధానమును మన యిచ్ఛవచ్చినటుల తయారు చేసుకొని అమలుపర్చుకోవచ్చునని శాసింపబడినది. 1931 సంవత్సరపు వెస్టు మినిస్టరు చట్టప్రకారము బ్రిటిషు రాజుతో సంబంధమును తెగత్రెంచుకొని సంపూర్ణ ప్రజాస్వామ్యమును స్థాపించుకొను హక్కు ఆస్ట్రేలియా మొదలగు మిగతా అన్ని డొమినియనులకు వలెనే ఇండియాకుకూడ ఏర్పడినది. కాని వారందరు ఆయా దేశములకు వలస వెళ్ళిన బ్రిటిషు జాతివారే కావున ఈ హక్కును చలాయించక బ్రిటిషురాజు క్రిందనే యున్నారు. ఇపుడు రెండవ ఎలిజబెత్ రాణి బ్రిటిషురాణిగ నున్నది. 1949 లో దక్షిణ ఐర్లండుదేశము మాత్రము ఈ హక్కును చలాయించి బ్రిటిషు రాజుతో సంబంధము త్రెంచుకొని (రిపబ్లికు) సంపూర్ణ ప్రజాస్వామ్యమైనది. దక్షిణ ఐర్లండులోని ప్రజలు ఆంగ్లేయులుకారు. వారిలో అత్యధికసంఖ్యాకులు రోమను కేథలిక్కులు. ఆంగ్లేయులు ప్రొటస్టెంటు మతస్థులై యున్నారు. వీరు ఆంగ్లేయ పాలనముక్రింద చాల కష్టముల ననుభవించినవారు. కావున దక్షిణ ఐర్లండు బ్రిటిషురాజునుండి పూర్తిగ విడిపోయినది. మన ఇండియాకు

నూతన రాజ్యాంగ సంవిధానమును తయారుచేయుట కొక రాజ్యాంగ సంవిధాన నిర్ణయసభ నెన్నుకొనినాము. ఆ సభవారు ఢిల్లీలో అనేక సార్లు సమావేశమై దీర్ఘచర్చలు జరిపి మన రాజ్యాంగ సంవిధానమును తయారుచేసినారు. దానిని 1949 వ సంవత్సరము 26 వ నవంబరు తేదీన అంగీకరించినటుల సభాధ్యక్షులు సంతకము చేసినారు. అంతటితో అది చట్టరూపమును దాల్చినది. మన రాజ్యాంగ సంవిధానము అనేక విషయములలో అమెరికా సంయుక్తరాష్ట్రముల సంవిధానమును, కొన్ని ముఖ్య విషయములలో ఆంగ్లేయ రాజ్య పద్ధతులను పోలి యున్నది. బహు స్వల్పముగ నితరదేశ రాజ్యాంగములను అనుకరించినది. ప్రపంచములోని ఇతర ప్రజారాజ్యముల అనుభవములను మన రాజ్యాంగ నిర్మాతలు ఉపయోగించుట సరియైన పనియే. మన ఇండియా రాజ్యాంగ సంవిధాన ప్రకారము బ్రిటిషు రాజుతో సంబంధమును పూర్తిగ వదులుకొని సంపూర్ణ ప్రజాస్వామ్యమును (రిపబ్లికును) స్థాపించుకున్నాము. ఇంగ్లండు దేశముపైన వంశ పారంపర్యమైన రాజరికము, వారి పార్లమెంటులో ప్రభువుల సభ గలవు. మనము అమెరికా సంయుక్తరాష్ట్రములవలె మన దేశమును రాజులు, ప్రభువులు లేని రిపబ్లికుగ (సంపూర్ణ ప్రజాస్వామ్యముగ) కావించుకొన్నాము. అమెరికా సంయుక్తరాష్ట్రములలోవలెనే మన రాజ్యముపైనకూడ వంశపారంపర్య హక్కుగల రాజుకు బదులు. ఎన్నుకొనబడిన ప్రెసిడెంటు (అధ్యక్షుడు) కలడు. ఆయనను మన దేశ భాషలలో రాష్ట్రపతి యని పిలుచుచున్నాము.

మన రాజ్యాంగ సంవిధానము 1950 వ సంవత్సరము జనవరి 26 వ తేది నుండి మనదేశమందంతటను అమలులోనికి వచ్చినది. దీని క్రింద 1952 సంవత్సర ప్రారంభమున ప్రథమఎన్నికలు జరిగినవి. మన దేశమునకు ప్రజలవల్ల ఎన్నుకొనబడిన పార్లమెంటు ఏర్పడినది. దానిలో

రెండు సభలు కలవు. మొదటిది లోకసభ (దిగువసభ); రెండవది రాజ్యసభ (ఎగువసభ). మన లోకసభ ఇంగ్లండులోని హౌస్ ఆఫ్ కామన్స్ (ప్రజా ప్రతినిధి సభ) వలె ఐదు సంవత్సరముల కొకసారి ఎన్నుకొనబడును. దీనిలో మన దేశములోని వివిధ(స్టేట్సు)రాజ్యములనుండియు కుల, మత వివక్షత లేక ఇరువదియొక్క సంవత్సరములు వెళ్ళిన స్త్రీ పురుషు లందరిచేత నెన్నుకొనబడిన, 500 మంది సభ్యులు గలరు. వీరిలో ఇద్దరు ఆంగ్లో ఇండియన్ సంఘమునకు చెందినవారు; మరి కొంతమంది హరిజనులకును, కొండజాతులకును నిర్ణయింపబడిన ప్రత్యేక స్థానముల ప్రతినిధులున్నారు. ఇంతేగాక దీనిలో 20 మంది కేంద్ర ప్రభుత్వ పాలితమైన ప్రాంతములనుండి వచ్చెడి ప్రతినిధులుకూడ గలరు. మన రెండవ సభయగు రాజ్యసభలో వాఙ్మయము, శాస్త్ర విజ్ఞానము, లలిత కళలు, సాంఘిక సేవ, వీటిలో ప్రవీణత చెందిన పన్నెండుమంది ప్రముఖులను రాష్ట్రపతి నియమించును. 213 మందిని వివిధ రాజ్యముల ఎసెంబ్లీలకు (విధాన సభలకు) ఎన్నుకోబడిన సభ్యులు ఎన్నుకొనెదరు. మరి ఏడుగురు కేంద్ర ప్రభుత్వ పాలితమైన ప్రాంతములనుండి వచ్చెడి ప్రతినిధులుందురు. రాజ్యసభ సభ్యుల కాలపరిమితి ఆరు సంవత్సరములు. కాని ప్రతి మూడవవంతు సభ్యులు రెండు సంవత్సరముల కొకసారి ఎన్నుకొనబడుటగాని నియమితులగుటగాని జరుగును. గావున మొత్తము సభ ఎప్పుడుకూడ విచ్ఛిన్నము కాకుండ నిలిచియే యుండును. దిగువసభయగు లోకసభ మాత్రము ఐదు సంవత్సరములు కాగానే ముగిసి విచ్ఛిన్నమై అన్ని స్థానములకును క్రొత్త ఎన్నికలు జరుగును. ఐదు సంవత్సరముల లోపలకూడ రాష్ట్రపతి లోకసభను విచ్ఛిన్నముచేసి క్రొత్త ఎన్నికలు జరుపుటకు అధికారము కలదు. ఇంగ్లండు పార్లమెంటులోని ఎగువ సభ ప్రభువులసభ. వారందరు యావజ్జీవ సభ్యులై యున్నారు. అట్టి

ప్రభువుల సభ మన రాజ్యాంగ సంవిధానములోను, అమెరికాలోను, బ్రిటిషు డొమినియనులలోను లేదు. అమెరికా సంయుక్త రాష్ట్రము లలో కాంగ్రెసు అని పిలువబడెడు పార్లమెంటులో కూడ రెండు సభలు గలవు. మొదటి సభ లేక దిగువ సభయైన ప్రజా ప్రతినిధి (House of Representatives) సభలో షుమారు 450 మంది సభ్యులు గలరు. వారందరు రెండు సంవత్సరముల కొకసారి వయోజనులగు స్త్రీ పురుషు లందరిచేతను ఎన్నుకొనబడుచున్నారు. రెండవ సభ, లేక ఎగువ సభయగు సెనేటు (శిష్టసభ) లో రాష్ట్రమునకు ఇద్దరు చొప్పున ప్రస్తుతముగల ఏబది రాష్ట్రములకు మొత్తము నూరు మంది ఆ యా రాష్ట్రముల ప్రజలచేత సరాసరి ఎన్నుకొనబడు చున్నారు. ఆ సభ్యుల కాలపరిమితి ఆరు సంవత్సరములు. కాని మూడవవంతు సభ్యులు ప్రతి రెండు సంవత్సరములకు ఎన్నుకొనబడు చున్నారు. కావున ఈ సెనేటు సభకు పూర్తి విచ్ఛిన్నము యనునది యుండనేరదు. అమెరికా రిపబ్లికు అధ్యక్షుడు అమెరికా ప్రజలవలన సరాసరి నాలుగు సంవత్సరముల కొకసారి ఎన్నుకొనబడుచున్నాడు. ఇండియా రాష్ట్రపతి ఇండియా పార్లమెంటులోని రెండుసభలకును ఎన్నుకొనబడిన సభ్యులచేతను, వివిధ (స్టేట్సు) రాజ్యములలోనివిధానసభల కెన్నుకొనబడిన సభ్యులచేతను, ఐదుసంవత్సరముల కొకసారి ఎన్నుకొనబడుచున్నాడు. లోకసభకు అధ్యక్షత వహించుటకు స్పీకరును (సభాపతిని) ప్రథమ సమావేశమునందే ఎన్నుకొందురు. ఒక ఉప సభాపతినికూడ ఎన్నుకొందురు. మన లోకసభకు ప్రస్తుతము స్పీకరు (సభాపతి) శ్రీమాన్ మాడభూషి అనంతశయనం అయ్యంగారు. ఉపసభాపతి శ్రీ సర్దారు హుకుంసింగుగారు. పార్లమెంటు యొక్క సభ్యులందరిచేతను ఇండియారిపబ్లికు కొక ఉపరాష్ట్రపతికూడ ఎన్నుకొనబడినాడు. మన రాష్ట్రపతి డాక్టర్ రాజేంద్రప్రసాదుగారు.

ఉపరాష్ట్రపతి డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణగారు. ఉపరాష్ట్రపతియే రాజ్యసభకు చైరుమనుగానుండును. రాజ్యసభ డెప్యూటీచైరుమనును ఎన్నుకున్నది. ప్రస్తుత డెప్యూటీచైరుమను శ్రీ ఎస్. వి. కృష్ణమూర్తి రావు గారు. అమెరికాలోకూడ రిపబ్లికు ఉపాధ్యక్షుడు ప్రజలచేత ఎన్నుకొనబడి సెనేటుసభకు చైరుమనుగ నున్నాడు. సెనేటుసభ వారు డెప్యూటీ చైరుమనును, ప్రజాప్రతినిధి సభవారు స్పీకరును (సభాపతిని) ఉపసభాపతిని ఎన్నుకొనుచున్నారు. లోకములోని వయసువచ్చిన ప్రతిపురుషునికిని, స్త్రీకిని ఓటుహక్కు కలుగచేయబడిన ప్రజా రాజ్యముగల రిపబ్లికులలో (డెమోక్రాటిక్ రిపబ్లిక్స్. Democratic Republics) ఇండియాయే పెద్దది. దీని జనసంఖ్య 36 కోట్ల 12 లక్షల 60 వేలు. ప్రజారాజ్యముగల రెండవ పెద్ద రిపబ్లికు అమెరికా సంయుక్తరాష్ట్రములై యున్నది. దాని జనసంఖ్య 14 కోట్ల 80 లక్షలు. దీని తరువాత ఫ్రెంచి రిపబ్లికు వచ్చును. దానిజనసంఖ్య ఎనిమిదికోట్లు. ఐరిషు ప్రజాస్వామ్యము, తురుష్క ప్రజాస్వామ్యము, సంయుక్తఅరబు రిపబ్లికు ఇట్టి రిపబ్లికులే. అవి చిన్న రాజ్యములు.

చైనా, రష్యాలు ప్రజారాజ్యములు కావు. అవి కమ్యూనిస్టు పార్టి నాయకుల నియంతృత్వ రాజ్యములు. వయసువచ్చిన ప్రతి పురుషునికి స్త్రీకి ఓటుహక్కు, వాక్స్వాతంత్ర్యము, పత్రికాస్వాతంత్ర్యము. సభాస్వాతంత్ర్యము. సంపూర్ణ మతస్వేచ్ఛ, రాజకీయపార్టీల నేర్పరచుకొనుహక్కు, వర్గసమన్వయము, సర్వసమత్వము, సర్వ సౌభ్రాతృత్వము, ప్రజారాజ్యముయొక్క ముఖ్యలక్షణములు. అవి చైనా, రష్యా, మొదలగు కమ్యూనిస్టు దేశములలోను స్పెయిన్ వంటి ఫాసిస్టుదేశములలోను లేవు. కమ్యూనిస్టుదేశముల ప్రభుత్వములు కేవలము కాయకష్టము చేయువర్గము వారియొక్క ప్రభుత్వమని

నిర్వచింపబడి, వర్గపోరాటమును జయప్రదముగసాగించి పై వర్గముల వారిని దౌర్జన్యముతో నాశమొనర్చి, కార్మికవర్గ నియంతృత్వమును స్థాపించినామని చెప్పుకొనుచున్నారు. ఆరాజ్యములలో కమ్యూనిస్టు పార్టీకితప్ప మిగిలినరాజకీయపార్టీలకు ఎట్టితావులేదు. నాస్తికత్వమును వ్యాపింపచేయుట వారి ప్రధాన మతతత్వము. ప్రజారాజ్యము (Democracy) కేవలము జాతీయతత్వము కలది. ప్రపంచములోని కార్మికులందరు ఒకే జాతి, ఏకమై పనిచేయవలెను అను అంతరాతీయ తత్వము కమ్యూనిస్టు రాజ్యముల మూలసూత్రము.

ఇండియా రిపబ్లికు, ఏ ఒక్క మతమును అవలంబించని, ఏ ఒక్క మతమునందును ప్రత్యేక గౌరవము చూపని, సర్వమతములయందు సమాన గౌరవము గల సెక్యులరు స్టేటు (Secular State). అనగ మతమునకు సంబంధములేని లౌకికరాజ్యము. ఈ విషయములో ఇది అమెరికా సంయుక్త రాష్ట్రములను పోలియున్నది. ఇంగ్లండు యొక్క రాజు లేక రాణి ప్రొటస్టెంటు క్రైస్తవ మతము యొక్క ఇంగ్లండు శాఖకు చెందినవారై యుండవలెను. అటుల చెందనిచో రాజ్యమున కర్హత పోవును. భారత జాతీయపతాకము మీద అశోకుని ధర్మ చక్రము ముద్రించబడి దానిక్రింద 'సత్యమేవ జయతే' అను ఉపనిష న్మహా వాక్యము వ్రాయబడియున్నది. భారతదేశము యొక్క త్రివర్ణ జాతీయపతాకములోని కాషాయరంగు త్యాగమునకును, ఆకుపచ్చని రంగు ధైర్యస్థైర్యములకును, తెలుపురంగు శాంతి సోదర భావముల కును చిహ్నములై యున్నవి. అమెరికా సంయుక్తరాష్ట్రముల పతా కము ఎరుపు, తెలుపు రంగుల పదమూడు చారలు గల జెండా. దానిమీద ఎడమవైపు పై భాగమున నీలపురంగు వేయబడి ఆ చోట ఏబది స్టేటులకు (రాష్ట్రములకు) చిహ్నములుగ ఏబది తెల్లని నక్షత్ర ములు ముద్రింపబడినవి. పదమూడు చారలు ప్రథమమున ఏకమై

సంయుక్త రాష్ట్రములుగ నేర్పడిన పదమూడు రాష్ట్రములచే చెప్పినవై యున్నవి.

అమెరికా సంయుక్త రాష్ట్రములకు వలెనే భారతదేశపు రాజ్యాంగ సంవిధానము వ్రాతమూలకమగు దస్తావేజై యున్నది. దానిలోని ప్రతివాక్యము తు. చ. తప్పకుండ అమలు జరిగి తీరవలసి యున్నది. దానివల్లనే భారత ప్రజల హక్కులు, అధికారములు నిర్ణయింపబడినవి. భారత రాజ్యమంతయు నడచుచున్నది. అది మన జాతీయ జీవనమునకు, పురోగమనమునకు, పునాది అధికారచట్టమై మనకు అతి పవిత్రమైనది. అమెరికాయొక్క కాని, భారతదేశము యొక్క కాని, రాజ్యాంగ సంవిధానమును అందులో చెప్పబడిన ఒక ప్రత్యేక నిర్ణీత విధానమున తప్ప ఎవరును మార్చుటకు వీలులేదు. ఈ రెండు దేశములలోనున్న సుప్రీం కోర్టులు వాటి క్రింద పనిచేయు చున్న హైకోర్టులు, ఈ రాజ్యాంగ సంవిధానమును పూర్తిగ అమలు జరుపును. ఇంగ్లాండులో వ్రాతమూలకమైన రాజ్యాంగ సంవిధానము లేదు. ఆచారములు, సాంప్రదాయికములు, పార్లమెంటువారు అప్పు డప్పుడు చేయు వివిధ చట్టములు, న్యాయస్థానముల తీర్పులు, ఆంగ్లేయుల హక్కులకు, అధికారములకు, రాజ్య పరిపాలనమునకు ఆధారములై యున్నవి.

అమెరికా సంయుక్త రాష్ట్రములతోపాటు ఇండియా ప్రజా రాజ్యము కూడ (సంయుక్త రిపబ్లిక్) ఫెడరల్ రిపబ్లిక్ అయి యున్నది. కెనడా, ఆస్ట్రేలియా డొమినియనులు రెండుకూడ ఫెడరల్ (సంయుక్త) రాజ్యములై యున్నవి. (ఫెడరలు) సంయుక్త రిపబ్లికులు లేక రాజ్యములనగ కేంద్ర పార్లమెంటు కేంద్ర ప్రభుత్వముతోపాటు, రాజ్యముల శాసనసభలు, రాజ్యముల ప్రభుత్వములేర్పడియుండు టయ్యున్నది. అమెరికాలో నిదివరకు నలుబది ఎనిమిది రాష్ట్రము

లున్నవి. ఇటీవలనే అలాస్కా, హోవాయి యను రెండు రాష్ట్రములు ఏర్పడినందున ఏబది రాష్ట్రములైనవి. ఇండియాలో నిదివరకెక్కువ సంఖ్యగల రాజ్యములున్నను, 1956 వ సంవత్సరములో జరిగిన రాష్ట్రముల పునర్వ్యవస్థీకరణవలన ఇపుడు పదునాలుగు రాజ్యములు మాత్రమున్నవి. ఇందులో ద్విభాషా రాజ్యమైన బొంబాయి రాజ్యము తప్ప మిగిలిన రాజ్యములన్నియు ఏకభాషా రాజ్యములై యున్నవి. అమెరికాలోను, ఇండియాలోను (ఫెడరలు), కేంద్ర పార్లమెంటు, కేంద్ర ప్రభుత్వము, రాజ్య శాసనసభలు, రాజ్య ప్రభుత్వములు స్థాపితమైనవి. అమెరికా అధ్యక్షునికి, ఫెడరలు పార్లమెంటుకు, ఫెడరలు గవర్నమెంటుకు రాజధాని వాషింగ్టన్ నగరము. ఇండియా రాష్ట్రపతికి, ఫెడరలు పార్లమెంటుకు, ఫెడరలు గవర్నమెంటుకు, రాజధాని ఢిల్లీ నగరము. అమెరికాలోను, ఇండియాలోను కూడ ప్రతిరాజ్యమునకు ఒకటి లేక రెండు శాసనసభలు, ఒక గవర్నరు ఉన్నారు. రాజ్యముల శాసనసభలు ప్రజలచే నెన్నుకొనబడుచున్నవి. అమెరికాలో రాష్ట్ర గవర్నరులు కూడ ప్రజలచే ఎన్నుకోబడు చున్నారు. ఇండియాలోని రాజ్య గవర్నరులు ఇండియా రాష్ట్రపతి చేత నియామకము చేయబడుచున్నారు. ఇంగ్లాండు చిన్న దేశ మగుటవల్ల రాష్ట్రములుగ విభజింపబడలేదు. యావత్తు దేశము నకు ఒకే పార్లమెంటు, ఒకే ప్రభుత్వము కలదు. రాష్ట్ర శాసనసభలు, రాష్ట్ర ప్రభుత్వములు లేవు. ఒకే పార్లమెంటు, ఒకే ప్రభుత్వము గల రాజ్యములను యూనిటరీ రాజ్యములు (Unitary States) అనగ ఏకప్రభుత్వ రాజ్యములని పిలచెదరు. ఫ్రెంచి రిపబ్లికుకూడ ఏకప్రభుత్వ రాజ్యమే. అమెరికాలో (ఫెడరలు) కేంద్రరాజ్యాంగ సంవిధానమును మాత్రము చట్టముగ చేసినారు. రాష్ట్రముల సంవిధానములను ఏ రాష్ట్రమున కిచ్చవచ్చిన రీతిని ప్రత్యేక చట్టమును గావించుటకు

ఆ యా రాష్ట్రములకే వదలిపెట్టినారు. ఇండియాలో నటులగాక ఫెడరలు అనగ కేంద్రమునకు, రాజ్యములకు కలిపి యొకే సంవిధానము తయారుచేయబడినది. దీనిని మార్పులు చేయుటకు కేంద్ర పార్లమెంటుకే అధికారము కలదు; గాని రాజ్యముల కధికారము లేదు. అమెరికాలో రాష్ట్రములే తమతమ సంవిధానములను మార్చుకొనవలెను. అమెరికాలోని రాష్ట్రములు తమకిచ్చవచ్చినయెడల అమెరికా ఫెడరలు సమాఖ్యనుండి విడిపోవచ్చును. ఇండియాలోని ఏ రాజ్యము ఇండియా కేంద్రప్రభుత్వమునుండి విడిపోవుటకు వీలులేదు.

ఇండియాలో ఫెడరలు అనగ కేంద్రప్రభుత్వము, రాజ్యప్రభుత్వములు ఉండుటబట్టి దేశమును పరిపాలించు ప్రభుత్వ శాఖలన్నియు మూడువిధములుగ భాగింపబడియున్నవి. కొన్ని ప్రభుత్వశాఖలు యావత్తు దేశమునకు సంబంధించినందున వాటికి శాసనములు చేయు అధికారము కేంద్ర పార్లమెంటుకును, వాటిని పరిపాలనచేయు అధికారము కేంద్రప్రభుత్వమునకును రాజ్యాంగ సంవిధానములో నివ్వబడినవి. కొన్నిపరిపాలనాశాఖలు కేవలము రాజ్యములకుసంబంధించినందున అవి రాజ్య శాసనసభలకును, రాజ్యప్రభుత్వములకును ఇవ్వబడినవి. ఇటుల రాజ్యముల కివ్వబడిన ప్రభుత్వ శాఖలలో కేంద్ర పార్లమెంటు, కేంద్రప్రభుత్వముకాని, కేంద్రమునకివ్వబడిన శాఖలలో రాజ్యశాసనసభలు, రాజ్యప్రభుత్వములు కాని ఎట్టి జోక్యము పుచ్చుకొనగూడదు. ఒకరి అధికారములోనున్న శాఖలలో రెండవవారు జోక్యము పుచ్చుకొన్నయెడల సుప్రీముకోర్టు, హైకోర్టు అట్టి ఆక్రమణను నిషేధించి ఆ విధముగ చేయబడిన శాసనములను ఆ ప్రభుత్వ చర్యలను రద్దుపరచును. ఇంతేగాక కొన్ని ప్రభుత్వశాఖలలో శాసనములు చేయుటకును, వాటిని అమలు జరుపుటకును కేంద్ర పార్లమెంటుకును, ప్రభుత్వమునకును రాజ్యముల శాసనసభలకును, ప్రభుత్వ

ములకును కూడ అధికారము కలుగచేయబడినది. కాని కేంద్ర పార్లమెంటు వాటి విషయమై శాసనములు చేసినట్లయిన వాటికి రాజ్యప్రభుత్వములు లోబడి యుండవలెను. రాజ్య శాసనసభల, రాజ్య ప్రభుత్వముల హక్కు అంతటితో తీవమై పోవును. ఈ విధముగ కేంద్ర శాఖలమీద కేంద్ర పార్లమెంటుకును, రాజ్య శాఖలమీద రాజ్య శాసనసభలకును సంపూర్ణ స్వతంత్ర అధికారము గలదు. కేంద్ర పార్లమెంటుకు రాజ్య శాసనసభలు లోబడినవి కావు. సర్వ స్వతంత్రము గలవి. అన్నియు రాజ్యాంగవిధాన చట్టముకే లోబడి యున్నవి. అయితే ఈ జాబితాలలో చెప్పబడని అనిర్దిష్టమై మిగిలిపోయిన హక్కులన్నియు (Residuary Powers) ఇండియాలో కేంద్రములో నున్నవి. అమెరికాలో ఈ హక్కులన్నియు రాష్ట్రములలో నున్నవి. కారణ మేమనగ అమెరికాలో ముందుగ సర్వస్వతంత్ర మగు పదమూడు రాష్ట్రము లేర్పడి పిమ్మట నవి కలసి సంయుక్త ప్రభుత్వము నేర్పరచుకున్నవి. ఇండియాలో పైనుంచి చేయబడిన రాజ్యాంగ సంవిధానమే రాజ్యములను సృష్టించినది. ఈ రెండు దేశములపైన సార్వభౌమాధికారము రాజ్యాంగ సంవిధానములో నున్నది. దానిని రూపొందించుకున్న ప్రజలలో నున్నది.

(దేశ రక్షణము, ఆయుధ చట్టములు, (అటం) అణుశక్తి, విదేశ వ్యవహారములు, ఐక్యరాజ్య సమితి, అంతర్జాతీయ వ్యవహారములు, యుద్ధము, సంధి, విదేశములనుండి ఇండియాకు రాకపోకలు, విదేశములతో ఒడంబడికలు, పౌరసత్వములు, రైల్వేలు, నౌకలు, వివిధ రాజ్యములను కలిపే పెద్ద రోడ్లు, గొప్ప రేవులు, ఆకాశ విమానములు, తంతి తపాలాలు, టెలిఫోనులు, తీగలేని టెలిగ్రాములు, రేడియోలు, నాణెములు, కరెన్సీ నోట్లు, రిజర్వు బ్యాంకి

ఆఫ్ ఇండియా, బ్యాంకులు, భీమా కంపెనీలు, విదేశ వ్యాపారము, పెట్రోలు నూనె బావులు, భారీ పరిశ్రమలు, ప్రామిసరి నోట్లు, పురాతన శిథిలములు, జనాభాగణితి, పార్లమెంటుకు రాజ్య శాసన సభలకు ఎన్నికలు, సుప్రీంకోర్టు హైకోర్టుల నిర్మాణము, ఆదాయపు పన్ను, వ్యవసాయ భూములు మినహా ఇతర ఆస్తులమీద మరణ సుంకములు, పొగాకు వగైరా ఎక్సైజు పన్నులు మొదలగు ప్రభుత్వ శాఖలు మన రాజ్యాంగ సంవిధాన ప్రకారము పార్లమెంటుకు కేంద్ర ప్రభుత్వమునకు ఇవ్వబడినవి. పోలీసు, శాంతి భద్రతలు, సుప్రీంకోర్టు హైకోర్టులు మినహాగా న్యాయ విచారణ శాఖ, జైళ్ళు, స్థానిక స్వపరిపాలన, గ్రామ పంచాయితీలు, ఆరోగ్యము, వైద్యము, దేవాలయములు, మత్తుపదార్థములు, విద్య, విశ్వ విద్యాలయములు, రోడ్లు, వంతెనలు, మోటారుకార్లు, లారీలు, వ్యవసాయము, పశు సమృద్ధి, నీటి వనరులు, ల్యాండు రివిన్యూ, అడవులు, గనులు, పరిశ్రమలు, వడ్డీవ్యాపారము, సహకార సంఘములు, మంత్రుల జీతములు, శాసనసభ్యుల హక్కులు, వ్యవసాయ భూముల మీద మరణసుంకములు, విద్యుచ్ఛక్తి, అమ్మకపు కొనుగోలు పన్నులు, మోటారుల పన్నులు, టోలు గేట్లు, వృత్తి పన్నులు, వినోదపు పన్నులు, స్టాంపు రిజిస్ట్రేషనులు, మొదలగునవి రాజ్యశాసనసభలకు రాజ్య ప్రభుత్వములకు ఇవ్వబడినవి. ఈ రెండు రకములైన ప్రభుత్వ శాఖలు గాక సివిలుకోడ్డు, ప్రొసిజరు కోడ్డు, వివాహము, హిందూ ముస్లింలా, పిచ్చి ఆస్పత్రులు, మందులు, కార్మిక సంఘములు, కార్మిక క్షేమము, ఆర్థిక ప్రణాళికలు, కాందిశీకులు, దేవాదాయ ధర్మాదాయములు, ఆహార పదార్థముల పంపిణీ, పుస్తకములు, పత్రికలు, ముద్రణాలయములు, పురాతత్త్వస్థలములు, మొదలగు శాఖలు కేంద్రమునకును రాజ్యములకును కూడ నివ్వబడినవి.

అమెరికాలో కేంద్రమున కివ్వబడిన శాఖలు, కేంద్రము నిర్వర్తించి గూడని శాఖలు నిర్వచింపబడినవి. మిగిలిన శాఖలన్నియు రాష్ట్రములకే వదలివేయబడినవి.

ఇండియాలోని పదునాలుగు రాజ్యములేమనగ : ఆంధ్ర ప్రదేశము, అస్సాం, బీహారు, బొంబాయి, కేరళ, మధ్యప్రదేశము, మదరాసు, మైసూరు, ఒరిస్సా, పంజాబు, రాజస్థానము, ఉత్తర ప్రదేశము, పశ్చిమ బంగాళము, జమ్ము కాశ్మీరము అయ్యున్నవి. ఇవిగాక ఢిల్లీ, హిమాచల ప్రదేశము, మణిపుర, త్రిపుర, అండమాను నికోబారు ద్వీపములు, లక్కదీవులు, మినికాయి అమీన్ దీవులు, ఫెడరలు (కేంద్ర) ప్రభుత్వ పాలిత ప్రాంతములయి యున్నవి. వీటి కెట్టి శాసనసభలు లేవు. పైన చెప్పబడిన పదునాలుగు రాజ్యములలో ఆంధ్ర ప్రదేశము, బీహారు, బొంబాయి, మధ్య ప్రదేశము, మద్రాసు, మైసూరు, పంజాబు, ఉత్తర ప్రదేశము, పశ్చిమ బంగాళములకు రెండు శాసనసభలును, మిగిలిన అయిదు రాజ్యములకు ఒకే శాసన సభయు గలవు. అన్ని రాజ్యముల మొదటి శాసనసభకు ఎసెంబ్లీ, అనగ విధానసభ అని పేరు. రెండు శాసనసభలున్నచోట్ల రెండవ శాసనసభకు అనగ ఎగువ శాసనసభకు కౌన్సిలు, అనగ విధానపరిషత్తు అని పేరు. ఈ పదునాలుగు రాజ్యములపైన గవర్నరు లున్నారని, వారు రాష్ట్రపతిచే నియమింపబడుచున్నారని ఇదివరకే చెప్పి యున్నాను.

1956 లో ఇండియాలోని రాజ్యము లన్నియు భాషా ప్రయుక్తముగ విభజింపబడినవని చెప్పియున్నాను. అమెరికాసంయుక్త రాష్ట్రములేర్పడి నాలుగువందల సంవత్సరములైనవి. వీరందరు యూరపు ఖండమునుండి వివిధభాషలు మాటలాడువారు ఇచటికి వలసవచ్చి కాపురమున్నారు. 1789 లో సంయుక్తప్రభుత్వ మేర్పడ

గనే వీరందరును అధిక సంఖ్యాకుల భాషఅయిన ఆంగ్ల భాషను జాతీయభాషగ చేసికొనినారు. అందువలన కేంద్ర, రాష్ట్రముల రాజ్యాంగమంతయు ఆంగ్లభాషలోనే జరుగుచున్నది. ఇండియాలో అటులు కాదు. ఇచట కొన్ని గొప్పభాషలు వేలసంవత్సరములచరిత్ర, వాఙ్మయముగలవై యున్నందున వీటిని తీసివేయుటకు వీలులేదు. గావున ఈ భాషలనుబట్టి ఈ రాజ్యములను విభజించి రాజ్యభాషలలో రాజ్యముల రాజ్యాంగమును నడపవలెనని యుద్దేశింపబడినది. ఏ స్వతంత్రదేశము విదేశభాషను తన రాజ్యాంగమున కుపయోగించదు. గావున ఇండియా రాజ్యాంగ విధానము 8 వ షెడ్యూలులో పదు నాలుగు దేశభాషలు అంగీకరించబడినవి. అవి ఏవనగా :

1. ఆంధ్రప్రదేశ రాజ్యభాష అయిన తెలుగు, 2. అస్సాం రాజ్యభాష అయిన అస్సామీస్, 3. బీహారు, మధ్య ప్రదేశము, రాజస్థానము, ఉత్తర ప్రదేశ రాజ్యముల భాష అయిన హిందీ, 4, 5. ద్విభాషా రాజ్యమైన బొంబాయి రాజ్యభాష లగు మరాఠి, గుజరాతి భాషలు, 6. పశ్చిమ బంగాళ రాజ్యభాష యగు బంగాళి, 7. మైసూరు రాష్ట్ర భాషయగు కన్నడము, 8. జమ్ము కాశ్మీరము యొక్క భాష కాశ్మీరి, 9. ఒరిస్సా రాజ్యభాష అయిన ఒరియా, 10. పంజాబు రాజ్యభాష పంజాబి, 11. మదరాసు రాజ్యభాష తమిళం, 12. కేరళ రాజ్యభాష మళయాళము అయ్యున్నవి. ఇవి గాక యావద్భారత దేశ వ్యాప్తముగా నున్న సంస్కృతము, ఉర్దూ భాషలుకూడ దేశ భాషలుగ అంగీకరింపబడినవి. కేంద్ర పాలన మంతయు అత్యధిక సంఖ్యాకుల భాషయగు హిందీలో 1965 సంవత్సరమునుండి జరుగవలెనని నిర్ణయించబడినది. కేంద్ర పాలనము నుండియు రాజ్యముల పాలనమునుండియు ఇంగ్లీషు భాషను తీసి వేయవలెనని యుద్దేశింపబడినది.

ఇండియాలోని రాజ్యములలోని శాసనసభల నిర్మాణమును గూర్చి ఉదాహరణముగ ఆంధ్ర ప్రదేశ్ రాజ్యముయొక్క శాసన సభలనుగూర్చి చెప్పిన చాలును. ఆంధ్ర ప్రదేశ రాజ్యపు జనసంఖ్య 3 కోట్ల 12 లక్షల 60 వేలు. వైశాల్యము ఒక లక్ష 6 వేల 41 చదరపుమైళ్ళు. రాజధాని హైదరాబాదు నగరము. దీనికి రెండు శాసనసభలు కలవు. దిగువసభ యైన ఎసెంబ్లీ లేక విధాన సభలో 301 మంది కులమత వివక్షతలేక 21 సంవత్సరములు వెళ్ళిన స్త్రీ పురుషు లందరిచేతను అయిదు సంవత్సరములకు ఎన్నుకొనబడిన సభ్యులు గలరు. వీరిలో 51 మంది హరిజనులకును, గిరిజనులకును ప్రత్యేకింపబడిన స్థానములకు ఎన్నుకొనబడినారు. ఈ 301 మంది గాక పైన నొక ఆంగ్లో ఇండియను సభ్యుని గవర్నరు నియమించి నాడు. విధాన సభయొక్క మొత్తము సంఖ్య 302. విధానసభ యొక్క కాలపరిమితి ఐదు సంవత్సరములు. ఈలోపల విధానసభను రాష్ట్రపతి ఆజ్ఞానుసారము గవర్నరు విచ్ఛిన్నముచేసి మరల ఎన్నికలు పెట్టవచ్చును. విధానసభవారు తమపై అధ్యక్షత వహించుటకు స్పీకరును (సభాపతిని) ఎన్నుకున్నారు. డెప్యూటీ స్పీకరునుకూడ ఎన్నుకున్నారు. ఎగువసభ యగు విధాన పరిషత్తులో 90 మంది సభ్యులు గలరు. వారిలో వాఙ్మయము, శాస్త్ర విజ్ఞానము, కళలు సహకారోద్యమము, సాంఘిక సేవలలో ప్రవీణులైనవారిని పన్నెండు మందిని గవర్నరునియమించినాడు. మిగతా వారిలో 31 మందిని ఆంధ్ర ప్రదేశ్ విధాన సభలోని సభ్యులు ఎన్నుకొన్నారు. పట్టభద్రులు, ఎనిమిదిమందిని, ఉపాధ్యాయులు ఎనిమిదిమందిని, స్థానికసంస్థలలోని సభ్యులు 32 మందిని ఎన్నుకొన్నారు. ఈ విధాన పరిషత్తు సభ్యుల యొక్క కాలపరిమితి ఆరు సంవత్సరములు. గాని వీరిలో మూడవ వంతు రెండు సంవత్సరముల కొకసారి ఎన్నుకొనబడుటగాని నియ

మితులగుటగాని జరుగుచుండును. కావున ఈ విధాన పరిషత్తుకు విచ్ఛిన్నత యనునది ఎప్పుడును ఉండజాలదు. విధానపరిషత్తువారు తమపై అధ్యక్షత వహించుటకు చైరుమను నెన్నుకొన్నారు. డిప్యూటీ చైర్‌మన్‌ను కూడ ఎన్నుకున్నారు. ఈవిధముగనే తక్కిన రాజ్యములలో కూడ నున్నది. అమెరికాలో నెబ్రాస్కా అను రాష్ట్రములో తప్ప మిగిలిన అన్ని రాష్ట్రములలోను రెండు శాసనసభలు గలవు. దిగువ సభకు (House of Representatives) హౌస్ ఆఫ్ రిప్రెజెంటేటీవ్స్-ప్రజాప్రతినిధి సభ అనియు, ఎగువ సభకు సెనేటు, అనగ శిష్టసభ యనియు పేర్లు గలవు. రెండు సభలును సరాసరి ప్రజలచే నెన్నుకొనబడినవే.

నవీన ప్రజా రాజ్యములలో చట్టనిర్మాణ శాఖ, ప్రభుత్వ నిర్వహణశాఖ, న్యాయ విచారణశాఖ లను మూడు వేరువేరు శాఖలు గలవు. వీటిలో న్యాయవిచారణశాఖ మిగిలినశాఖలలో దేనికిని లోబడియుండక సర్వ స్వతంత్రముగ నున్నది. ఇంగ్లండులో న్యాయ విచారణ శాఖకు అత్యున్నత కోర్టు ప్రీవీ కౌన్సిలు. దాని క్రింద మిగిలిన సివిలు, క్రిమినలు కోర్టులన్నియు నున్నవి. అమెరికాలోను, ఇండియాలోను సుప్రీముకోర్టు అత్యున్నత న్యాయస్థానము. దాని క్రింద హైకోర్టులు, జిల్లాకోర్టులు, ఇంకను చిన్నకోర్టులు గలవు. ఈమూడు దేశములలోని అన్ని కోర్టులయొక్క న్యాయాధిపతులు సర్వ స్వతంత్రులుగ తీర్పులు చెప్పెదరు. శాసనముల కర్థములుచెప్పి శాసనముల నమలు పరచెదరు. రాజ్యాంగ సంవిధానములో నిర్ణయించబడిన హక్కులను సంరక్షించెదరు. శాసనముల నుల్లంఘించిన వారికి శిక్షలు విధించెదరు. వివిధ రాజ్యములమధ్య గల తగవులను, రాజ్యముల మధ్య కేంద్ర ప్రభుత్వము మధ్య తగవులను కూడ సుప్రీము కోర్టులు, హైకోర్టులు తమ తీర్పులవల్ల పరిష్కరించెదరు.

ఇక చట్ట నిర్మాణశాఖకు, ప్రభుత్వ నిర్వహణశాఖకు గల సంబంధమును గూర్చి తెలుసుకొందము. ఇంగ్లండులోను, డొమినియనులలోను వలెనే ఇండియాలో కూడ పార్లమెంటరీ ప్రభుత్వము (బాధ్యతాయుత ప్రభుత్వము) స్థాపించబడినది. అదివరకు ఇంగ్లండు పార్లమెంటులోని ఎగువ సభయగు ప్రభువుల సభకు గల అధికారములు 1911 వ సంవత్సరములో చాలవరకు తీసివేసినారు. అప్పటి నుంచి ఆర్థిక విషయములలోనే కాక ఇతర శాసనములు చేయు విషయములో కూడ ప్రజలచేత సరాసరి ఎన్నుకొనబడిన దిగువ సభయగు (హౌస్ ఆఫ్ కామన్స్ - House of Commons) ప్రజాప్రతినిధి సభయే నిజమైన అధికారము గల సభయైనది. అంతేకాక ప్రభుత్వ నిర్వహణమున కంతకును అధిపతులై, దేశములోని వివిధ ప్రభుత్వముల శాఖలను నిర్వహించెడు అధికారవర్గము మీద యాజమాన్యమును గలిగియున్న మంత్రు లందరును ఈ దిగువ సభయగు ప్రజాప్రతినిధిసభకే బాధ్యతవహించి యున్నారు. వారిమీద విశ్వాస రాహిత్య తీర్మానమును ఈ ప్రజా ప్రతినిధి సభలోనే పెట్టి మంజూరు చేయించిన యెడల వారు తమ పదవులకు రాజీనామానివ్వవలసి యున్నది. పైసభయగు ప్రభువుల సభలో మంత్రివర్గముమీద విశ్వాస రాహిత్య తీర్మానము పెట్టుటకు వీలులేదు. ఇటులనే ఇండియా రాజ్యాంగ సంవిధానములోను కూడ ఏర్పాటు కావించినారు. ఆదాయవ్యయపట్టిక, పన్నుల విధానము, ఆర్థిక సంబంధమైన శాసనములు పార్లమెంటులో ప్రజలచే సరాసరి ఎన్నుకొనబడిన దిగువ సభయగు లోకసభలోను, రాజ్యవిధాన మండలులలోని ప్రజలచే సరాసరి యెన్నుకొనబడిన దిగువ సభయగు ఎస్సెంబ్లీలోను (విధానసభలోను) ప్రవేశపెట్టబడి మంజూరుకావలెను వాటిని పై సభయగు రాజ్యసభ కాని, కౌన్సిలు కాని మంజూరు చేయనక్కరలేదు. వాటిని చర్చించి

సలహాల నిచ్చుటకు మాత్రము పై సభలకు పంపెదరు. ఆ సలహాలను దిగువ సభ పాటించనక్కరలేదు. అంతేగాక ఇతర శాసనముల విషయములో కూడ రెండు సభలు అంగీకరించవలసియున్నను, రాజ్యములలో దిగువ సభ అంగీకరించినదానిని ఎగువసభ అంగీకరించక త్రిప్పి వేసినను, కొన్ని సవరణలను సూచించినను ఆ శాసనములు మరల దిగువసభలో చర్చించబడి మంజూరుచేయగానే ఆ మంజూరు చేయబడిన విధముననే గవర్నరువద్దకు అంగీకారముకొరకు పంపబడును. గవర్నరు దానిని అంగీకరించక త్రిప్పివేసినచో మరల నవి రెండు శాసనసభలకును వచ్చి మంజూరైనచో వాటిమీద గవర్నరు దస్కతు పెట్టి తీరవలెను. అవి చట్టములగును. పార్లమెంటులో మాత్రము ఒక సభ మంజూరుచేసినదానిని రెండవ సభకు పంపగ వారు దానిని పూర్తిగ అంగీకరించక దానికి సవరణలు ప్రతిపాదించిన యెడల సవరణలతో శాసనము మరల మొదటి సభకు వచ్చును. వారు ఆ సవరణలను ఒప్పుకొననిచో రాష్ట్రపతి రెండుసభలను కలిపి జాయింటు సమావేశము నేర్పాటుచేయగ నా సమిష్టి సమావేశములో మంజూరైన విధముననే ఖాయమై రాష్ట్రపతి యొక్క ఒప్పుదలకు పంపబడును. ఆయన అంగీకరించినగాని అది చట్టము కాదు. ఆయన అంగీకరించక త్రిప్పివేసిన యెడల మరల పార్లమెంటులో రెండు సభలు దానిని చర్చించి మంజూరుచేయవలెను. అటుల మంజూరు చేసిన యెడల దానిని అంగీకరించినటుల రాష్ట్రపతి దస్కతు పెట్టితీరవలసి యున్నది. పార్లమెంటులోను, రాజ్యముల విధానమండలులలోను ప్రజలచేత ఎన్నుకొనబడిన రాజకీయపార్టీలలోని పెద్ద పార్టీకి చెందిన సభ్యులచేత నెన్నుకొనబడిన నాయకుని రాష్ట్రపతి, లేక గవర్నరు ప్రధానమంత్రిగ లేక ముఖ్యమంత్రిగ గావించుచున్నాడు. రాజ్యములలో ప్రధానమంత్రిని ముఖ్యమంత్రి అని పిలచెదరు. ప్రధానమంత్రి

లేక ముఖ్యమంత్రి వారి పార్టీకి చెందినవారిని మిగత మంత్రులుగ సూచించి రాష్ట్రపతిచేత లేక గవర్నరుచేత నియమింపచేయును. ప్రధానమంత్రికి లేక ముఖ్యమంత్రికి ఇష్టములేని మంత్రులను తీసి వేయించి మరల కొత్తవారిని నియమింపచేయవచ్చును ఇటుల మంత్రివర్గము పార్లమెంటులోను రాజ్యములలోని విధానమండలుల లోను పెద్ద రాజకీయపార్టీనుండి ఏర్పడుచున్నది. రాజ్యాంగ సంవిధానముప్రకారము పార్లమెంటుకు, లేక రాజ్యములలో శాసన సభలకు (విధానమండలులకు) యివ్వబడిన ప్రభుత్వ శాఖలన్నిటిని ఈమంత్రులు పంచుకొని వాటిని నిర్వహించుచున్నారు. పార్లమెంటు లేక విధానమండలి మంజూరుచేసిన చట్టములను, తీర్మానములను పన్నుల విధానములను, ఆర్థిక విషయములను, ఆదాయవ్యయ పట్టిక లను వారు అమలు జరుపుచున్నారు. శాంతిభద్రతలను కాపాడు చున్నారు. సుపరిపాలనమును సాగించు బాధ్యత కలిగియున్నారు. ప్రభుత్వ నిర్వహణకు సంబంధించిన అధికారవర్గమంతయు ఈ మంత్రివర్గము క్రింద నుండును. మంత్రులు తమకు కావలసిన అన్నివిధములైన శాసనములను, పన్నుల విధానములను, ఆర్థిక విష యములను, ఆదాయ వ్యయ పట్టికలను పార్లమెంటులో లేక విధాన మండలిలో ప్రవేశపెట్టి మంజూరు చేయించెదరు. పార్లమెంటుయొక్క విధానమండలియొక్క అనుమతి లేనిది వారు ఏ పని చేయజాలరు. తమకు పార్లమెంటులో, లేక విధాన మండలిలో పెద్దపార్టీ కలదు కావున తాము ప్రవేశపెట్టినవన్నియు తప్పక మంజూరగును. పార్ల మెంటులో, లేక విధాన మండలిలో వారు ప్రవేశపెట్టినవి వారికి తగిన బలములేక మంజూరు కానిచో వారు రాజీనామానివ్వవలెను. ప్రజలచే నెన్నుకొనబడిన పార్లమెంటు లేక విధాన మండలి సర్వాధి కారియై యున్నది. దానికి మంత్రివర్గము, మరియు వారి క్రిందనున్న

అధికారవర్గము లోబడి పాలనము గావించుచున్నది. దాని ద్వారానే ప్రజలు తమ సార్వభౌమాధికారమును చెలాయించుచున్నారు. ఇదే విధముగ ఇంగ్లండు రాణి డొమినియనుల గవర్నరు జనరలులు పార్లమెంటులోని పెద్ద పార్టీనుండియే ప్రధాన మంత్రులను నియమించెదరు. ఆయన తన పార్టీనుండియే తన ఇతర మంత్రులను నియమింప చేయును. గావున ఇంగ్లాండులోను, డొమినియనులలోను, ఇండియాలోను ప్రధానమంత్రులు, రాజ్యములలో ముఖ్యమంత్రులు, తమకు వెనుక పెద్ద రాజకీయపార్టీ బలముగ నున్నంత కాలము అతి బలవంతులై సర్వాధికారము గలవారై యున్నారు. ఇంగ్లాండులో రాణి డొమినియనులలో గవర్నరు జనరలు గవర్నరులు, ఇండియాలో రాష్ట్రపతి లేక గవర్నరులు, ప్రధానమంత్రి లేక ముఖ్యమంత్రి యొక్క సలహానునుసరించియే అన్ని విషయములలోను నడచి తీరవలెను. ఇదియే పార్లమెంటరీ, లేక బాధ్యతాయుత ప్రభుత్వము యొక్క ప్రధాన లక్షణము. ఇంగ్లాండు డొమినియనులు, ఇండియా వలె రిపబ్లికులు గాకపోయినను, ఇండియావంటి ప్రజా రాజ్యములయినందున ఇండియా బ్రిటిషు కామన్వెల్తులో (బ్రిటిషు ప్రజారాజ్యముల కూటములో) సభ్యురాలుగ నుండుట కంగీకరించినది.

ఈ బాధ్యతాయుత ప్రభుత్వమునకు పార్లమెంటులోను, రాజ్య శాసనసభలలోను, బయటను, రాజకీయపార్టీలు బలపడి యుండుట, ఎన్నికలలో నీ పార్టీలు పోటీపడుట, అధికసంఖ్యాకులుగ నెన్నికైన పార్టీయే మంత్రివర్గమేర్పరచుట, అది యోడిపోయినచో ప్రతిపక్షము మంత్రివర్గమును ఏర్పరచుట, అతి ముఖ్యమైన విషయములు. ఇంగ్లండులో ఇపుడు కన్సర్వేటివ్ (మార్పులకు విముఖులగు) పార్టీ, లేబరు (కార్మిక) పార్టీ, రెండుపార్టీలు ప్రధానపోటీదార్లుగ నున్నారు. లిబరలు పార్టి నామమాత్రావశిష్టముగ నున్నది. ఇండియాలో కేంద్ర

ములోను, పన్నెండు రాజ్యములలోను కాంగ్రెసు పెద్ద పార్టీగ నున్నది. కమ్యూనిస్టు, సోషలిస్టు పార్టీలు చిన్నవిగ నున్నవి. కేరళ రాజ్యములో నిటీవల కమ్యూనిస్టుపార్టి పెద్ద పార్టిగను, కాంగ్రెసు పార్టి రెండవ పార్టిగను, పిమ్మట ప్రజాసోషలిస్టులు మొదలగు చిన్న పార్టీలును ఉండెను. ఇపుడు క్రొత్త ఎన్నికలు వచ్చుచున్నందున ఏ రాజకీయపార్టి అధిక సంఖ్యాకులుగ వచ్చునో దానికే మంత్రివర్గము లభించును. ఒరిస్సాలో ఏ ఒక్క పార్టీకి తగినంత సంఖ్యాబలము లేనందున కాంగ్రెసు, గణతంత్రపార్టీలు కలసి మంత్రివర్గము నేర్పరచు కున్నవి. మిగిలిన పార్టీలు చిన్నవిగ నున్నవి.

అమెరికాలో బాధ్యతాయుత ప్రభుత్వములేదు. అమెరికా పార్లమెంటులోను, రాష్ట్రముల శాసనసభలలోను మంత్రులులేరు, ప్రభుత్వ నిర్వహణమంతయు ప్రెసిడెంటు క్రిందను, రాష్ట్రములలో గవర్నరుల క్రిందను నున్నది. వీటిలోకూడ డెమోక్రెటికు పార్టియని, రిపబ్లికను పార్టియని రెండు రాజకీయ పార్టీలున్నవి. రిపబ్లికు ప్రెసిడెంటు గవర్నరులు ఏదో ఒక రాజకీయ పార్టీకి నాయకులే. కాని వారు ప్రజలచే సరాసరి ఎన్నుకొనబడినవారై చట్ట నిర్మాణ శాఖ నుండి స్వతంత్రులుగ నున్నారు. వారు తమ ఇష్టము వచ్చిన సెక్రెటరీలను, ఇతర ఉద్యోగస్థులను నియమింతురు. అట్టి నియామకము పై సభయగు సెనేటు (శిష్టసభ) వల్ల ఖాయపరచబడవలెను. సెనేటుసభ ఆర్థిక విషయములనుకూడ మంజూరు చేయవలెను. అచట సెనేటుకు ఎక్కువ అధికారములున్నవి. ప్రెసిడెంటుగాని, గవర్నరుగాని, ఆయన క్రింది సెక్రెటరీలు, యుద్యోగస్థులుగాని, పార్లమెంటులోను, శాసన సభలలోను సభ్యులుకారు. వారిమీద పార్లమెంటులోగాని, శాసన సభలలోగాని విశ్వాసరాహిత్య తీర్మానమును తెచ్చుటకు తావులేదు. ప్రెసిడెంటు, గవర్నరులు పార్లమెంటులోను రాష్ట్ర శాసన సభల

లోను సందేశములుబంపి శాసనములను, పన్నుల విధానములను, ఆర్థిక విషయములను, ఆదాయ వ్యయ పట్టికలను తమ సెక్రెటరీలచేత ప్రవేశ పెట్టించెదరు. అవి మంజూరు కాకపోయినను వారు ఎవరు రాజీనామా నివ్వక్కరలేదు. ఎంతవరకు మంజూరైన అంతవరకే అమలు జరిపెదరు. విదేశ వ్యవహారములు, సైన్యము, యుద్ధము సంధి ప్రెసిడెంటు క్రింద నున్నవి. సెనేటు వాటిని ఖాయపర్చవలెను. అమెరికాలోని కేంద్రములో ప్రెసిడెంటు, రాష్ట్రములలో గవర్నరులు ఎక్కువ బలవంతులుగ నున్నారు. గాని పార్లమెంటు లేక శాసన సభలు మంజూరుచేసిన శాసనములను పదిరోజులలో ప్రెసిడెంటు లేక గవర్నరు అంగీకరించవలెను. అటుల అంగీకరించక త్రిప్పివేసినచో మరల పార్లమెంటులోని రెండు సభలలోను లేక రాష్ట్రములలోని రెండు శాసనసభలలోను మూడింట రెండు వంతులమందిచేత ఆమోదింపబడినట్లయిననే ఆ శాసనములను అధ్యక్షుడు లేక గవర్నరు అంగీకరించినటుల దస్కతు పెట్టితీరవలెను. దస్కతు పెట్టకపోయినను అవి అమలులోకి వచ్చును. గాని అమెరికా రాజ్యమంతయు అచటి తెల్లవారగు స్త్రీ పురుషులకే చెందియున్నది. షుమారు రెండుకోట్ల మంది నీగ్రోలున్నను వారు నల్లవారగు కారణముచే వారికి రాజ్యములో ఎట్టి హక్కులు అధికారము లేకుండ చేసినారు. ఇండియాలో హరిజనులకు అంటుదోషము తీసివేయబడి అన్ని విషయములలోను మిగిలిన ప్రజలతోపాటు సర్వ విధములైన రాజకీయ సాంఘిక హక్కులు అనుభవించుచున్నారు. గాంధి మహాత్ముని నాయకత్వము క్రింద హరిజన సమస్య న్యాయముగ పరిష్కరించబడినది.

అమెరికా సంవిధానమునకు సవరణల రూపముగ ప్రజల పౌరస్వత్వములు, ప్రాథమికహక్కులు విస్తరింపచేయబడినవి. ఇండియాలో ప్రథమముననే అట్టి పౌరస్వత్వములు, ప్రాథమిక హక్కులు

రాజ్యాంగ సంవిధానమునందు విశదీకరించబడినవి. చట్టము ఎదుట దేశపౌరుల సమానత్వము, సార్వజనిక ఉద్యోగముల విషయములో మతము, జాతి, కులము, స్త్రీ పురుష భేదములు, జన్మస్థానము కారణములుగ గల విభేదములేమియు చూపకుండుట, అస్పృశ్యతను రద్దుచేయుట, వాక్స్వాతంత్ర్యము, పత్రికా స్వాతంత్ర్యము, సభా స్వాతంత్ర్యము, సంఘములను ఏర్పాటుచేయు స్వాతంత్ర్యము, ఆస్తి యందు హక్కు, చట్టముప్రకారమే అరెస్టుచేయు విచారణచేయు నిబంధన, బానిసత్వనిషేధము, పదునాల్గు సం.ల లోపు పిల్లలు ఫ్యాక్టరీల లోను గనులలోను పని చేయకూడదను నిషేధము, మత స్వేచ్ఛ. ప్రాణము యొక్క స్వాతంత్ర్యము యొక్క రక్షణ, భాష లిపి సంస్కృతి యొక్క రక్షణము, మొదలైన హక్కులన్నియు విశదీక రించబడినవి. ప్రభుత్వము ప్రజల యొక్క శ్రేయస్సుకొరకై పాటు పడవలెను. స్త్రీ పురుషులగు పౌరులందరు తగినంత జీవనోపాధిని వీలైనంత సమానముగ పొందుటకు హక్కు కలిగి యున్నారు. దేశము యొక్క నైసర్గిక సంపదను వృద్ధిచేసి ప్రజలకు అనుభవ యోగ్యముగ చేయవలెను. సమానమైనపనికి స్త్రీ పురుషు లిరువు రకును సమానమైన వేతనము లభింపవలెను. గ్రామ పంచాయితీలను స్థాపించవలెను. కార్మికుల జీవనమునకు తగిన కూలి నివ్వవలెను. పిల్లలకు ఉచిత నిర్బంధ విద్య గరపవలెను. ప్రజలలోని వెనుకబడిన జాతుల యొక్క, హరిజనుల యొక్క, గిరిజనుల యొక్క, విద్యా, ఆర్థిక శ్రేయస్సుల కొరకు ప్రత్యేక జాగ్రత తీసుకొనవలెను. వారికి సమాజములో అన్యాయము జరుగకుండ కాపాడవలెను. ప్రజల జీవన ప్రమాణమును హెచ్చించుటకు ప్రత్యేకముగ కృషిసలుపవలెను. మత్తు కలిగించు పానీయములను నిషేధించవలెను. వ్యవసాయాభి వృద్ధిని పశుపోషణను గావించవలెను. అంతర్జాతీయ శాంతిభద్రతలను

ప్రవర్ధనముగావించవలెను. అంతర్జాతీయ విషయములలో న్యాయము, ధర్మము వర్ధిల్లునట్లు చూడవలెను — ఈ మొదలైనవి ప్రజా ప్రభుత్వము యొక్క లక్ష్యములని చెప్పబడినది. ఏ జాతివారినైన అస్పృశ్యులుగ చూచినఎడల శిక్షవిధించుచు చట్టము కూడ చేయబడినది.

పార్లమెంటులోను, విధాన మండలిలోను సభ్యులు ఏమి మాట్లాడినను అందుకు వారిమీద ఏ కోర్టులోను ఎట్టి అభియోగములు నేరారోపణలు చేయ వీలులేదు. వారిని సభ్యముగ మాటలాడునట్లు క్రమశిక్షణలో నుంచుట, వారి హక్కులను రక్షించుట, పార్లమెంటులోను విధానమండలిలోను సత్సాంప్రదాయములను నెలగొల్పి గౌరవమును పెంపొందచేయుట, రాజ్యాంగ సంవిధానప్రకారము నిబంధనల ప్రకారము సభా కార్యక్రమమును నిర్వర్తించుట, స్పీకరు యొక్క చైర్మన్ యొక్క హక్కు బాధ్యతల క్రింద నున్నవి. స్పీకర్ గాని, చైర్మన్‌గాని ఇచ్చెడి తీర్పులపైన న్యాయస్థానముల కెట్టి అధికారము లేదు. మన రాజ్యాంగ సంవిధానమే మన జాతీయ జీవనమునకు ప్రజల హక్కులకు, మనదేశములో ప్రజల శ్రేయోరాజ్య(రామరాజ్య) స్థాపనకు, అంతర్జాతీయ శాంతికి, సోదరత్వమునకు ప్రమాణ చట్టమై యున్నది. దానిని చక్కగ తెలిసికొనుట ప్రజల కర్తవ్యము. నేను పైన వ్రాసిన ఉపోద్ఘాతము వలన మన రాజ్యాంగ సంవిధానమును బాగుగ తెలిసికొనవలెనను ఆసక్తి హెచ్చిన ఎడల నేను ధన్యుడనయ్యెదను.

నాగార్జునవిహార్, హైదరాబాదు,
4—8—1959.

అయ్యదేవర కాళేశ్వరరావు

ప్రకరణము 1

# మన రాజ్యాంగము

శ్రీ నారాయణ లోకసభాసభ్యుడు. ఒకనాటి ఉదయము తన బంగాళాలో ఒకగదియందు భార్యాపిల్లలతో సావకాశముగ కూర్చొని తేనీరు త్రాగుచున్న సమయమున తన నౌకరు గది లోనికి వచ్చి ఒక యుత్తరమును శ్రీనారాయణకి అందించెను. ఆ యుత్తరము తపాలా బంట్రోతు అప్పుడే తెచ్చినది. నారా యణ ఉత్తరము విప్పి చదువుకొనెను.

"ఏమిటి ఆ యుత్తరము ?" అని భార్య అడిగెను.

"ఇది లోకసభ యొక్క సమావేశమునకు హాజరుకావలసిన దని ఆధికారికాహ్వానము. దీనిని 'సమను' అందురు."

"సభ యెప్పుడారంభము కాగలదు ?" అని భార్య ప్రశ్నించెను.

"ఈనెల రెండవ వారములో. అనగా యిప్పటి కింకను పదిరోజులున్నది." అని నారాయణ చెప్పెను.

కొంచెము ముందుకువచ్చి కొడుకు శేఖరు "నాన్న గారూ ! యీమారు మమ్ములను ఢిల్లీ తీసుకవెళ్లెదరు గదా ? మాకు లోకసభ చూడవలెనని యున్నది." అనెను.

ఆమాట అందుకొని కూతురు కుమారి లీల "మీరెన్నియో పర్యాయములు ఢిల్లీ వెళ్లుచుందురు. ఒకమారైనను మమ్ము లను తీసుకొని వెళ్ళలేదే ?" అనెను.

"యీమారు తప్పక మిమ్ములను తీసుకుని వెళ్లెదను" అని నారాయణ చెప్పెను.

శేఖరు: "బొమ్మలలో పార్లమెంటు భవనముయొక్క చిత్రమును చూచితిని; పెద్దదియై గుండ్రముగా నున్నదే కదా, లోకసభాభవనము ?"

నారా: "అవును. ప్రపంచములోనున్న ఉత్తమ భవనములలో మన లోకసభాభవన మొకటి."

లీల: "అయిన నాన్నగారూ! పార్లమెంటు అనగా నేమి?"

నారా: "మన దేశములోగల ప్రజలతాలూకు ప్రతినిధు లందరును కలుసుకొని పరిపాలన కవసరమైన శాసనముల నన్నిటిని చేసెదరు. వారు కలసికొని ఆలోచించు చోటు పార్లమెంటు భవనము. ప్రతినిధులు సమావేశమైన సభను 'పార్లమెంటు' అందురు."

లీల: "ప్రతినిధులు శాసనముల నెందుకు చేయవలెను ?"

నారా: "మనది ప్రజారాజ్యము. అందు ప్రజలే రాజులు. తమకు తామే పరిపాలించుకొనెదరు. ప్రజలందరూ ఒకచోటుననే సమావేశమగుట కవకాశముండదు. అందువలన మనలో కొంతమందిని, మన ప్రతినిధులుగా నెన్నుకొనెదము. వారు మన తరఫున శాసనములను చేయుచు పరిపాలన నడిపింతురు."

లీల: "ప్రతినిధుల నెలాగు ఎన్నుకొనెదరు ?"

నారా: "మన పట్నములో రెండు సంవత్సరముల క్రితం జరిగిన ఎన్నికలు జ్ఞాపకములేదా ?"

లీల : "ఓ! జ్ఞాపకమున్నది! బాగుగ జ్ఞాపకమున్నది! ఎన్ని సమావేశములు, ఎన్ని ఊరేగింపులు జరిగినవి! వలంటీర్లు! వారి కేకలు! మాకు 'వోటు' నిమ్మని, మాకు 'వోటు' నిమ్మని వారును వీరును అడుగుట! జ్ఞాపకమున్నది."

శేఖరు : "మీరుకూడ నొక యభ్యర్థియేకదండి? ఎన్నియో సభలలో మాట్లాడియుంటిరి. చివరకు వోటు చేయవలసిన రోజు వచ్చెను. అంతమందియు వోటుచేయవలసిన స్థలములకు (పోలింగు బూత్స్) వెళ్ళి వోటులనిచ్చిరి. అందరికి వచ్చిన వోటులకన్న మీకు హెచ్చుగ వచ్చినవి; మీరు గెలిచితిరి. ఊరేగింపు కూడ జరిగినది. జ్ఞాపకమున్నది."

నారా: "బాగుగ జ్ఞాపకముంచుకుంటివి. ఎన్నికలా మోస్తరుగ అయిదుసంవత్సరముల కొకమారు దేశమంతటను జరుగును. ఆ ఎన్నికలందు గెలిచినవారందరు కలిసిన సభ పార్లమెంటు అగును. వారు పార్లమెంటు సభ్యులగుదురు."

శేఖరు : "అలాగయిన, మా మామ క్రిందటిమారు గెలిచెనుగద, మరి మీలాగున ఢిల్లీకి వెళ్ళలేదే? అతను పార్లమెంటు సభ్యుడు కాడా?"

నారా : "అతను గెలిచినది పార్లమెంటు ఎన్నిక కాదు. అది యొకరాజ్యము (స్టేటు) యొక్క శాసనసభకు ఎన్నిక. మనదేశము చాల పెద్దది. జనాభా చాలా హెచ్చు. యిది నీకు తెలిసినవిషయమేకదా? ఢిల్లీలో ఒకచోటున కూర్చొని దేశమునెల్లా పరిపాలించుటయు, అటుల

పరిపాలించి ప్రజల యొక్క బాగోగుల సరిగ కనిపెట్టు టయు కష్టమయిన పని. అందుచే మనదేశమును కొన్ని రాజ్యముల క్రింద విడదీసిరి. అందులో ప్రతిరాజ్యమునకు ఒక శాసనసభను నియమించిరి. ఒక మంత్రిమండలిని గూడ ఏర్పాటుచేసిరి. ఈ శాసనసభకు గూడ ప్రతినిధులను ప్రజలే యెన్నుకొనెదరు."

శేఖరు: "అటులయిన, రాజ్య శాసనసభకును, లోకసభకును ఏమి భేదమున్నది?"

నారా: "లోకసభ దేశమంతటనుండియు వచ్చిన ప్రతినిధులతో నేర్పాటుచేయబడును. రాజ్యములలోనున్న శాసనసభలు ఆ రాజ్యములోనుండి ఎన్నికై వచ్చిన ప్రతినిధులతో మాత్రమే ఏర్పాటగును."

శేఖరు: "అనిన,. రెండు ప్రత్యేకసభలన్నమాట."

నారా: "అవును. లోకసభయు, రాజ్యసభయు కలసి పార్లమెంటు అగును. రాజ్యసభ, లోకసభలలో వచ్చిన ప్రతినిధులందరును ప్రత్యేకముగ ఎన్నికచెందినవారు. అందుచే వారు మనదేశమంతటికిని ప్రాతినిధ్యము వహింతురు. రాజ్యముల శాసనసభలలోని సభ్యులవలన ఎన్నికగన్న వారు రాజ్యసభయందుందురు. రాజ్యములలో గల శాసనసభలకు రాజ్యసభ ప్రతినిధిసభ యనవచ్చును."

శేఖరు: "అయిన పార్లమెంటునకు రెండుసభ లెందులకు?"

నారా: "శాసనములు దేశపరిపాలనకు చాల ముఖ్యమైనవి. అందుచే శాసనము చాల జాగ్రత్తగను ఆలోచనతోను

చేయవలెను. ఒకే సభ యున్నట్లయిన ఒకప్పుడు వాని విషయమై అవసరమైనంత ఆలోచన చేసి తగినంత జాగ్రత్త తీసికొనకపోయియుండవచ్చును. లేక తాత్కాలికముగనుండు ఆవేశములనుబట్టి శాసనములను తొందరపాటుగ చేసియుండవచ్చును. అటువంటి అజాగ్రత్త, తొందరపాటు ఎపుడైనను జరిగియుండినచో వానిని సరిదిద్దుటకు రెండవసభ, అనగా రాజ్యసభయుండుట చాల మంచిది. సాధారణముగ వయోవృద్ధులు, అనుభవశాలురు ఆ సభయందుందురు.

లీల : "పార్లమెంటులో యీ సభ్యు లేమిచేయుదురు ?"

నారా : "అవసరమైనపుడు సమావేశమగుదురు. ప్రజల కుపయోగకరమైన శాసనముల గురించి ఆలోచింతురు. దైనిక పరిపాలనార్థము తమలో కొంతమందిని మంత్రులుగ నియమింతురు. మంత్రి మండలినే గవర్నమెంటు అనిన్ని ప్రభుత్వమనిన్ని యందురు. వారు కార్యములను పార్లమెంటు యెడల బాధ్యతతో నిర్వర్తింతురు. కొంతకాలము తరువాత ఆ మంత్రులు మనకు ఇష్టము లేకున్నచో వారి మంత్రి పదవికి రాజీనామా యిప్పించవచ్చును."

లీల : "అయినచో మన ప్రధాన మంత్రిని పార్లమెంటువారు ఎన్నుకొనిరా ?"

నారా : "అవును. అనగా ఆయన పార్టీ, పార్లమెంటులోని మిగిలిన పార్టీలకన్న పెద్ద పార్టీ. ఆ పార్టీ వారు

ఆయనను తమ నాయకునిగ నెన్నుకొనిరి. పార్ల మెంటులో ఆయన పలుకుబడి హెచ్చుగ నున్నదన్న మాట. అందుచే రాష్ట్రపతిగారు ఆయనను మంత్రి మండలిని తన యాధిపత్యముక్రింద పర్చరచి, రాజ్యము నడిపించవలసినదని కోరిరి. అప్పుడు ప్రధానమంత్రి కొంత మంది పార్లమెంటు సభ్యులను మంత్రులుగ తీసికొని, రాష్ట్రపతికి తెలియపరచగా ఆయన ప్రధానమంత్రితో పాటు వారిని మన మంత్రిమండలిగ నియామకము చేసిరి. దైనందిన వ్యవహారములను అనేక భాగముల క్రింద విభజించి మంత్రిమండలి పరిపాలన చేయును."

లీల: "రాష్ట్రపతి ఎన్నిక ఎట్లు జరుగును?"

నారా: "పార్లమెంటు సభ్యులును, రాజ్యము (స్టేట్సు) లలోని శాసనసభల సభ్యులును కలసి రాష్ట్రపతిని ఎన్నుకొనె దరు. ఎన్నికయిన తరువాత, ఒకప్పుడు ఆయన ఆ పద వికి తగినవాడు కాదని తోచిన యెడల సభ్యులందరు కలసి పదవినుండి ఆయనను తప్పించగలరు. కాని సాధా రణముగ ఆలాగున జరగదు. అందుచే చూచితివా? రాజ్య పరిపాలనావర్గ మంతయుకూడ ప్రజలవలన ఎన్ని కయి, ప్రజలయెడ తమకుగల బాధ్యతలను నిర్వర్తిం చుచు, ప్రజాప్రతినిధుల మూలముగ తమ జవాబుదారీ నెరవేర్చుకుందురు. ప్రజారాజ్య మనగా నిదియే. ప్రజలే పై విధముగ పరిపాలన నడిపించెదరు.

శేఖరు: "మరి, యీ రాష్ట్రపతిగాని, మంత్రులుగాని, పార్లమెంటు సభ్యులుగాని ఎన్నికలయిన తరువాత, భయ మొదవి ప్రజల యభిప్రాయములకు వ్యతిరేకముగ నడచిన ఏమగును?"

నారా: "అటుల చేయలేరు. ఎందుకనగ, అయిదు సంవత్సరముల కొకమారు ఎన్నికలు జరుగును. ఎవరైనను ప్రజల కోరికలకు ప్రతికూలముగ నడచిన, ప్రజలు వారిని తిరిగి ఎన్నుకొనరు కద! మరియు రాష్ట్రపతిని, మంత్రులను పార్లమెంటు అయిదు సంవత్సరములవరకు ఆగ నక్కరలేకయే, తమ పదవులనుంచి తొలగించవచ్చును."

"అలాగునైన చాల మంచి పద్ధతి" యని శేఖరు మెచ్చుకొనెను.

దానిపైన,

లీల: "ప్రజలే నిజమైన పరిపాలకు లనుచుంటిరి. వారికి వోటు నిచ్చు హక్కుయున్నమాట నిజమే. కాని అంత మందియు వోటు నివ్వగలరా ఎన్నికలందు?" అన్నది.

నారా: "తప్పకుండ. ప్రతివానికి వోటు నిచ్చుటకు హక్కుగలదు."

శేఖరు: "బాగున్నది. క్రిందటి ఎన్నికలలో నేను వోటు చేయలేదేమి?"

"నేను మాత్ర మెక్కడ నిచ్చితిని?" అన్నది లీల.

నారా : "మీరిద్దరును చిన్నపిల్లలు. 21 సంవత్సరముల వయసు వచ్చువరకు వోటింగు చేయుటకు హక్కు లేదు."

"ఎందుచేత ?" అని శేఖరు ప్రశ్నించెను.

నారా : "మీరు పసివారలు. వోటు అర్థించుటకు వచ్చిన పెద్ద మనుష్యులలో (అభ్యర్థులలో) ఎవరికి శాసనసభలో కూర్చొనుటకు తగిన యర్హత యున్నదో లేదో మీ రెలాగు తెలుసుకొన గలరు ?"

శేఖరు : "అయిన మేము 21 సంవత్సరముల వయస్సు వచ్చిన తరువాత వోటు చేయవచ్చునా ?"

"తప్పక" అని తండ్రి నిర్వచించెను.

దానిమీద,

శేఖరు : "వోటు యిచ్చుట యనగానేమి ? నాకు మీలాగున సభ్యుడనై లోకసభలో కూర్చొనవలెనని యున్నది."

నారా : "ఓ ! అదియు కావచ్చును. కాని అలాగున సభ్యు డగుటకు, అనగా, ఎన్నికలందు పోటీ చేయుటకు 25 సం. వయస్సు యుండవలెను" అని చిరునవ్వుతో అనెను.

"నామాటేమి ? నేను సభ్యురాలను కావచ్చునా ?" అని లీల - ఆడపిల్ల గనుక - తన విషయమును అడిగెను.

నారా : "ఏల కాకూడదు ? ఆడువారికిని, మగవారికిని ఈ విషయములో వ్యత్యాసము లేదు. మీ అన్న ఎన్నికలకు నిలుచొనిన, పోటీగా నీవు నిలువవచ్చును. నీవు పోటీలో గెలిచిన నీవు సభ్యురాల వగుదువు. మీఅన్న కాజాలడు." అని అనెను.

లీల అన్నవైపు ఓరగాచూచుచు, "నేను పెద్దదానినయిన తరువాత తప్పక అటుల చేయుదును."

"అలాగయిన నేను రాష్ట్రపతినే అయిపోవుదును." అని శేఖరు అనెను.

"నేను నిన్ను ఓడించకమానను, ఎప్పుడో అప్పుడు" అని లీల అన్నవైపు చూచుచు మరొకమారు అనెను.

శేఖరు మాటసందర్భమును మార్చుటకు "నాన్నగారూ ! మన పార్లమెంటు ఎప్పుడు ఆరంభమయినదండీ?" అని అడిగెను.

"సరే యీరోజు కొంతవరకు కథ అయినది. ఆలస్యమైనది. నేను మరియొక సభకు వెళ్లవలెను. ఈ విషయములన్నియు మరియొకరోజున కూర్చొని మాటలాడుదము" అని నారాయణ చెప్పెను. తేనీరు అందరు త్రాగిన తరువాత ఎవరి పనిమీద వారు లేచివెళ్ళిరి.

ప్రకరణము 2

# మన ఇండియా

కొన్నిరోజుల తరువాత, కుటుంబముతో స్వస్థలమైన తిరువనంతపురము వదలి ఢిల్లీకి నారాయణ బయలుదేరెను. ఢిల్లీ త్వరలో చూతుమన్న ఆనందములో పిల్లలు తన్మయులైరి. ఢిల్లీనిగురించి వారు చాల చదువుకొనిరి. చాల వినియున్నారు. దక్షిణమునుండి ఉత్తరమువైపునకు ఇంత దూరప్రయాణ మిది వరలో వారు చేసియుండలేదు.

శేఖరు : "ఎన్ని రోజులగును, నాన్నగారూ, మనము ఢిల్లీ చేరుసరికి ? యిక్కడకు చాల దూరముకద ?"

నారా : "అవును. రెండువేల మైళ్ళ దూరమున్నది. మనము దేశమునకు చాల దక్షిణముగ నున్నాము. మనము చేరుసరికి మూడురాత్రులు, మూడుపగళ్ళు పట్టును."

శేఖరు : "అబ్బ ! మనదేశ మెంత పెద్దది ?"

నారా : "అవును. ప్రపంచములోని పెద్దదేశము లన్నిటిలో వరుసగ చూచిన ఏడవది. దీని విస్తీర్ణము పదమూడు వేల చదరపు మైళ్ళు. తూర్పునుండి పడమటకు పదివేల మైళ్ళు ఉండును."

"అయిన, మన దేశముయొక్క జనాభా ఎంత యుండును ?" అని లీల అడిగెను.

నారా : "ముప్పదియారు కోట్లకు పైగ నుందును. మాటలాడు భాషలందు భేదము లున్నవి. కట్టు, బొట్టు, వేషము లలోగూడ కొంచెము భేదములు గలవు. అయినను యావన్మందియు, మనకు సోదరీ సోదరు లనుకొన వలెను."

శేఖరు : "మన దేశములో నెన్ని భాషలు గలవు ?"

నారా : "ముఖ్యమైన భాషలు పదునాలుగు. యివికాక ప్రాంతీయములగు భాష లనేకములున్నవి."

శేఖరు : "దేశమునంతను, ఢిల్లీలోనున్న ప్రభుత్వమే పరిపాలన చేయునా ?"

నారా : "లేదు. దేశమంతయు రాజ్యము (స్టేట్సు) ల క్రింద విభాగముచేసిరి. పూర్వము మద్రాసు, బొంబాయి, మధ్యప్రదేశ్, పంజాబు, పశ్చిమబెంగాలు రాజ్యములలో బ్రిటిషు హాయాములో గవర్నరుల అధిపత్యము క్రింద ప్రభుత్వము నడచినది. తిరువాంకూరు, కొచ్చిన్, మైసూరు, హైదరాబాదు, మధ్యభారత్, సౌరాష్ట్ర మొదలగునవి పూర్వము స్వతంత్ర సంస్థానాధీశుల పరిపాలనలోయుండెడివి. తరువాత మొన్న మొన్నటివరకు రాజప్రముఖుల యాజమాన్యము క్రింద యుండెడివి. ఇప్పుడు దేశములోనున్న రాజ్యములలో కొన్ని మార్పులు జరిగినవి. రాజప్రముఖులను తొలగించిరి. అన్ని రాజ్యములకు గవర్నరుల నేర్పాటుచేసిరి."

లీలా : "అయిన నాన్నగారూ ! అన్ని రాజ్యములలో శాసన సభలు ఢిల్లీలోవలెనే రెండుసభలుగ యున్నవా ?" అన్నది లీల.

నారా : "లేదు. చెన్నపట్నము, పంజాబు, పశ్చిమబెంగాలు, బీహారు, ఉత్తరప్రదేశము ఆంధ్రప్రదేశములందు శాసన సభ (లెజిస్లేటివ్అసెంబ్లీ) యని, శాసనపరిషత్తు (లెజిస్లేటివ్ కౌన్సిలు) యని రెండేసిసభలుండును. అసెంబ్లీని దిగువసభ యనియు, కౌన్సిలును ఎగువసభ యనియు గూడ ననెదరు. మిగిలిన రాజ్యములందు ఒక సభయే యున్నది. అది శాసనసభ (దిగువసభ) యని యందురు."

"ఈ శాసనసభల సభ్యులను ప్రజలే ఎన్నుకొనుచున్నారా ?" అని శేఖరు అడిగెను.

నారా : "అవును. రాజ్యము (స్టేట్సు) లలో నున్న ప్రజలే తమ రాజ్యము యొక్క శాసనసభాసభ్యులను ఎన్నుకొనెదరు. ఎగువసభకు (లెజిస్లేటివ్ కౌన్సిలు) పురపాలక సంఘములు కొంతమందిని, దిగువ సభ సభ్యులు కొంతమందిని ఎన్నుకొనెదరు. మరికొంతమందిని రాజ్యముయొక్క గవర్నరు నియామకము చేయును."

శేఖరు : "గవర్నరులకు శాసనసభల యెడ జవాబుదారీ యున్నదా ?"

నారా : "లేదు. గవర్నరులను రాష్ట్రపతి నియమించును. అందుచే రాష్ట్రపతికే జవాబుదారీగా వారు నడుచుకొనెదరు; మరియు తమ రాజ్యములో గల మంత్రి

మండలి యొక్క సలహాను అనుసరించియే వారు నడుచుకొనవలెను. మంత్రులకు ప్రజలపట్ల జవాబుదారీ యుండియేయున్నది. రాష్ట్రపతి గూడ యటులే తన మంత్రుల సలహామీద నడుచుకొనును."

ఈలాగున మాటలాడుచుండగా రైలుబండి దట్టముగా పెరిగిన కొబ్బరితోటలలోనుండి మలబారు కోస్తాను గల వనములలో మెల్లగ పోవుచుండెను.

"ఎంత చక్కగనున్నవి యీ కొండలు, చెట్లు," అని పిల్లలు సంతసముతో అనిరి. నిజముగ అచ్చటి ప్రకృతిసౌందర్యము ఇంతింత యని చెప్ప వీలులేదు. రైలుబండి ఉప్పు కేరుల వారలలో చెట్టులమధ్యగా వెళ్లుచుండ మరపురాని అందము కన్పించును. ఈ ప్రాంతములు కేరళరాజ్యములోని భాగములు.

నారా: "మన మిప్పుడు పశ్చిమకోస్తా వెంట వెళ్లుచున్నాము. అరేబియా సముద్రము మన ఎడమవైపున దగ్గరగనే యున్నది. మీకు తెలియునుగదా? మనదేశమునకు పశ్చిమమున అరేబియాసముద్రము, తూర్పున బంగాళా ఖాతము, దక్షిణమున హిందూమహాసముద్రము నున్నవి. ఈ మూడు సముద్రముల జలములు మన ప్రియ జన్మ భూమియగు భారతమాత పవిత్ర పాదములను నిత్యము ప్రక్షాళనము చేయుచుండును."

లీల: "అయిన మనదేశమున కుత్తరమున ఏమిగలదు?"

నారా: "ఉత్తరమున మహాపర్వతములయిన హిమాలయములు వున్నవి. భారతమాత శిరస్సున నున్న వజ్రపుకిరీటములవి.

దేశమున నటు నిటు ప్రవహించు నదులన్నియు పువ్వుల దండలవలె, రత్నహారములవలె ఆమె శరీరము నలంక రించుచున్నవి." అని నారాయణ చెప్పెను.

ఇంతలో రైలుబండి తూర్పునకు తిరిగి పశ్చిమ కనుమల లోనికి ప్రవేశించెను.

పైని దట్టముగా కొండ శిఖరములపై గల మేఘముల వైపు చూచుచు "ఈ కొండ లేమి కొండ"లని శేఖరు అడిగెను.

నారా : "ఈకొండల పేరులు పడమటి కనుములు. దక్షిణమున మన రాష్ట్రమున ఆరంభమై ఉత్తరమున బొంబాయి వరకు నున్నవి. మన ప్రాంతములందు వీనిని సహ్యా పర్వతములనిగూడ పిలుతురు. మహారాష్ట్రమునందు సహ్యాద్రి యని వీని పేరు."

"మనదేశమునందుగల యితర పర్వతములు ఏవి?" అని లీల అడిగెను.

"తూర్పు కోస్తావెంబడి తూర్పు కనుమ లను పర్వతములు గలవు. ఈ రెండు పర్వతకనుమలును, హిమాలయములును మన దేశముయొక్క సరిహద్దులందు, దేశరక్షణమునకై నిర్మించిన పెద్దకోటలవలె నున్నవి. ఇవిగాక, మనదేశముయొక్క నడు మను తూర్పు పడమరలుగ వింధ్యపర్వతములును, సాత్పూర పర్వతములుగూడ కలవు. పైని జెప్పిన యీ అన్ని పర్వత ములనుండియు చిన్నవియు, పెద్దవియునైన నదు లనేకములు జన్మించి ప్రవహించుచున్నవి; భూములను సుక్షేత్రములుగ

జేయుచున్నవి; కోట్లకొలది ప్రజలకు ప్రాణాన్నప్రదానము చేయుచున్నవి."

"ఆనదుల పేర్లేమండీ?" అని లీల అడిగెను.

నారా : "చాల పేరులున్నవి. అందు ముఖ్యమైనవి గంగ, యమున, బ్రహ్మపుత్ర, సింధు, నర్మద, గోదావరి, కృష్ణ, కావేరి. వీటికి ఉపనదులుగూడ చాలగలవు. అవియును చాలపెద్దవి. దేశములో ప్రజలు నదులను దేవతలుగ భావించి పూజించెదరు. దేశముయొక్క భాగ్యములకు అనాదిగ ఈనదులే ఆధారభూతములై యున్నవి."

వీరు ఇటుల మాటలాడుచుండగ రైలుబండి కొండలలో త్రవ్విన సొరంగములగుండ వెళ్ళుచుండెను. అప్పుడు పిల్లలకు బ్రహ్మాండమైన సంతోషము, ఆశ్చర్యము కలిగెను. పడమటి కనుమల దాటి తూర్పుభాగమైన సస్యప్రదేశములగుండ రైలు పోవుచుండెను. త్రోవలో నటునిటు బాగుగ నెత్తైన గుడిగోపురములు చాల గాన్పించెను. గోపురముల చూచినపుడు పిల్లలకు ఇవి ఏమిటి అని వింతగా తోచెను.

శేఖరు : "ఈదేశము పేరేమిటండీ నాన్నగారు ?"

నారా: "మనమిప్పుడు మద్రాసు రాజ్యములోనికి వచ్చితిమి. ఈరాజ్యమున, చాల గొప్పగొప్ప దేవాలయములు, గోపురములు ఉన్నవి. మద్రాసురాజ్యము యిందులకు ప్రఖ్యాతి చెందినది. పూర్వకాలపు శిల్పనైపుణ్యము యీ దేవాలయములలో బాగుగ కన్పించును. పూర్వకాలమందు యీ ప్రాంతములు విదేశీయుల దాడులకు

హెచ్చుగ గురికానందున దేవాలయములు పూర్వవైభవ
ముతో చాల మిగిలినవి."

రైలు మధుర చేరినది. ఆకాశములో చొచ్చుకొనుచు అందముగ పురాతన దేవాలయ శిఖరములు రైలు స్టేషన్ నుండియే పిల్లలకు కాన్పించినవి.

లీల : "ఈ పట్నములో నాలుగు గోపురములొక రూపము
నసే యున్నవి."

నారా: "ఈ పట్టణము మధుర. చాల పురాతనమైనది. పూర్వమునుండియు ప్రతిభతోనున్న పట్నము. చాల కాలమునుండి, గొప్ప తమిళ రాజులు ఇచట రాజ్యము చేసిరి. ఒకప్పుడు తమిళపాండిత్యమునకుగూడ ప్రధాన కేంద్రము. ఇతరదేశములనుండు పండితులందరు పండిత గోష్ఠులకు యిచ్చట కలియుట గలదు. మధురపాండిత్య గోష్ఠులందు వచ్చిన ప్రతిష్ఠయే ప్రతిష్ఠ. అప్పు డలాగున యుండెను."

రైలు మధుర విడుచుసరికి సంధ్యాసమయ మయినది. కొంచెము కొంచెము చీకటి అలుముకొనుచున్నది. రైలుబండిలో నుండి అవతల యున్నది పిల్లలకు ఏమియును కన్పించుటలేదు. అందుచే పిల్లలు వెలుపలి చీకటిలోనికి చూచుట మాని తండ్రి దగ్గరగచేరి, పూర్వమునుండి దక్షిణ హిందూదేశమును పరి పాలించిన రాజులగురించి యడుగుట మొదలిడిరి. ఇవియె గాక, చాల కథలు నారాయణ పిల్లలకు చెప్పుట మొదలిడెను. చోళ, పాండ్య వంశపు రాజుల చరిత్రలను, దిగ్విజయములను,

అంతః కలహాములను, ఆరోజులలో యుండిన కవిశేఖరులను, మొదలైనవారల గురించి అనేక విషయముల నాయన చెప్పెను; వినుచువినుచు పిల్లలు నిదురించిరి.

మరునా డుదయము రైలు చెన్నపట్నము చేరెను. ఆ పట్నములో రెండు దినములు గడిపిరి. చూడవలసిన స్థలముల నన్నిటిని చూచిరి. ముఖ్యముగ సముద్రతీరమునకు వెళ్ళిరి. చెన్నపట్నములో సముద్రతీరము చాల సొగసుగా నుండును. అంత అందమైన సముద్రతీర పట్నములు అరుదు. మరియొకటి యుండిన యుండవచ్చును.

అచటనుండి గ్రాండుట్రంకు ఎక్స్‌ప్రెస్సులో ఎక్కి ఢిల్లీ నగరమునకు ప్రయాణమయిరి. కొంతదూరము వెళ్ళిన తరువాత శేఖరునకు ఒక స్టేషన్ ప్లాటుఫారముమీద మాట్లాడుచున్న వారి భాష మరియొక భాషలాగున కన్పించెను. ఆ భాష యతనికి అర్థము కాలేదు.

శేఖరు: "ఏమి టీభాష ?"యని తండ్రిని అడిగెను.

నారా: "ఈ భాష తెలుగు. మన మిప్పుడు ఆంధ్ర రాజ్యము లోనికి వచ్చితిమి. ఈపైని మాటలాడు భాష తమిళ మునుగాదు, మళయాళమునుగాదు, మరియొక భాష."

శేఖరు: "ఈభాషలో కొన్ని మాటలు మన మాటలుగనే యున్నవండీ ?"

నారా: "అవును. తమిళము, తెలుగు, కన్నడము, మళ యాళము, అన్నియుకూడ ఒక తల్లిభాషనుండియే జన్మించినవి. సంస్కృతమునుండిగూడ చాల మాటలు

యీ భాషలలో చేరినవి; ఉత్తర హిందూదేశమున నున్న భాషలు సంస్కృతమునుండి జన్మించినవి. దక్షిణ భాషలు ద్రవిడ భాషలు—ఉత్తరభాషలు ఆర్యభాషలు."

ఇంతలో రైలు తెనాలి చేరుకున్నది. పిల్లలు "తెనాలి రాముడుండిన వూరు యిదేనా" అని అడిగిరి.

పిల్లలు: "చాలకథలు అతనిని గురించి మేము విన్నాము."

నారా: "అవును. అదే. తెనాలిరామలింగకవి విజయనగర రాజయిన కృష్ణదేవరాయని యాస్థానమున నుండెను. ఆ బ్రహ్మాండమయిన విజయనగర రాజ్యము తరువాత శిథిలమై పోయెను. హంపీలో శిథిలావస్థలో నున్న గోడలు, గోపురములు కొంచెము కొంచెము మిగిలి యున్నవి."

వారటుల మాటలాడుచుండగ సాయంకాలమయినది. తెలంగాణాలోనున్న హైదరాబాదు పట్నము చేరుకొనిరి. అప్పటి తెలంగాణా యిప్పుడు ఆంధ్రరాజ్యమం దొక భాగము. అజంతా, ఎల్లోరా గుహాలు యీ ప్రాంతముల దగ్గర యున్నవి. ప్రపంచములో పేరుగన్న గొప్పగొప్ప చిత్రములు ఆగుహాలలో నున్నవి. కొండల దొలిచి కట్టిన దేవాలయము లందున్నవి. ఆ దేవాలయములు ప్రపంచమున కాశ్చర్యజనకములై యున్నవి. ఈ రాజ్యములో తెలుగు, మహారాష్ట్రము, ఉరుదు ప్రజలు మాటలాడెదరు. ప్రక్కనున్న మైసూరు, బొంబాయి, గెర్సొప్పా జలపాతము, యితర జలపాతములు, శ్రావణ బెళగోలలోగల గోమటేశ్వరుని పెద్ద రాతివిగ్రహము, బేలూరుదేవాలయము,

ఎలిఫెంటా గుహలు, మొదలుగాగల అనేక స్థలములగురించి పిల్లలకు నారాయణ చెప్పెను. మహారాష్ట్ర నిర్మాతయయిన ఛత్రపతి శివాజీ విషయముకూడ చెప్పెను.

శేఖరు : "ఈరాజ్యములలో నేమి భాషలు మాట్లాడెదరు ?"

నారా : "మైసూరున కన్నడము, బొంబాయి పట్నములో మహారాష్ట్రము, హిందీ, గుజరాతీ, తెలుగు, కన్నడము మాటలాడు ప్రజలు చాలమంది గలరు."

లీల : "ఇప్పుడు మనము వెళ్ళు రైలుబండి యీ రాజ్యము లన్నిటిగుండ వెళ్ళునా ?" అని అడిగెను.

నారా : "వెళ్ళదు. ఇవన్నియు మనకు పశ్చిమముగా యుండి పోవును."

"మనకు తూర్పున ఒరిస్సా, బీహారు, పశ్చిమ బంగాళా, అస్సాము రాజ్యము లున్నవి. ఎవరిరాజ్యములో వారు వారిభాష అధికారభాషగ వాడుకొనెదరు. వారి శాసన సభలలోగూడ అంతియే. ఆరాజ్యములకు వెళ్ళవలెనన్న మరొకమారు మనము ప్రత్యేకముగ వెళ్ళవలెను."

శేఖరు : "ఆరాజ్యములలో ముఖ్యముగ మనము చూడవలసినవి ఏమి యున్నవి ?"

నారా : "ఒరిస్సా రాజ్యములో పూరీజగన్నాథము, భువనేశ్వరము, కోనార్క తప్పక చూడవలసినవి. అక్కడనున్న దేవాలయములు సుప్రసిద్ధములు. గొప్ప శిల్పచాతుర్యము వెల్లడిచేయును. బీహారులో పూర్వము చాల పేరుపొందిన పాటలీపుత్రము ఉన్నది. ఇప్పుడు దాని

పేరు పాట్నా. చంద్రగుప్తమౌర్యుడు, అశోకుడు, దానిని రాజధానిగ యేర్పరచుకొని రాజ్యము చేసిరి. బీహారులోని నలంద ఒకప్పుడు విశ్వవిఖ్యాతమైన విద్యా నిలయము. అప్పుడది బౌద్ధులకు ముఖ్య విద్యా కేంద్రము. చీనా మొదలైన దూర దేశములనుండి విద్య నభ్యసించుటకు చాలమంది బౌద్ధభిక్షుకులు వచ్చెడివారు. బంగాళా దేశము చాల పెద్దది. ఆవిషయము మీకు తెలిసినదే. శ్రీ రామకృష్ణ, వివేకానంద, రవీంద్రనాథ ఠాకూరు, నేతాజీ సుభాస్ బోసు మొదలగు దేశప్రముఖులు బంగాళా రాజ్యమందే జన్మించిరి."

బిడ్డలకు ఇంతలో నిద్ర వచ్చినట్టులయినది. చాల రాత్రి అయినది. మరుసటి ఉదయమగుసరికి మధ్యప్రదేశమున వార్ధాలో రైలు ఆగినది.

"ఇక్కడనే గదా గాంధీగారు ఉండేవారు ?" అని శేఖర మడిగెను.

"అవును. సేవాగ్రామమని ఒక చిన్నగ్రామము, ఇచ్చటకు మూడుమైళ్ళ దూరమునందు గలదు. అందులో ఒక కుటీరమందు గాంధీగారు నివసించేవారు; తమ జీవిత కాలమందు చివర భాగమున అక్కడనే ఉండేవారు."

"సేవాగ్రామము వెళ్ళి చూడవలెనండి" అని లీల అన్నది.

"తిరిగి ఇంటికి వెళ్ళునపుడు మనమచ్చటికి పోవచ్చును. గాంధీగారు నివసించే కుటీరమింకను అలాగుననే ఉన్నది. జాతీయ చిహ్నముగ నుండును" అని నారాయణగారనిరి.

"గాంధిగా రెక్కడ జన్మించిరి ?" అని లీల యడిగెను.

"ఆయన కతియవాడలో జన్మించిరి. కతియవాడు ఇప్పుడు బొంబాయిరాష్ట్రమం దున్నది."

"ఎక్కడ ?"

"పశ్చిమకోస్తాలో, బొంబాయినగరమున కుత్తరముగ నున్నది. అయితే ఇప్పుడు మనమార్గములో లేదు. రాజస్థాను దానికి పూర్వోత్తరముగ నుండును. అదియు మనమిప్పుడు పోవు మార్గమునందు లేదు. పంజాబు కాశ్మీరు రాష్ట్రములు కూడ మనమిపుడు చూడము. గుజరాతులో గుజరాతీభాష, పంజాబులో పంజాబీభాష, కాశ్మీరులో కాశ్మీరుభాష మాట లాడుదురు."

"శౌర్యవంతులు రాజపుత్రులు. రాజస్థాన మేకద వారుండు నది ?" అని శేఖరు డనెను.

"అవును. రాణాప్రతాపునకు, రాణి పద్మినికి జన్మస్థానము రాజస్థానము. చిత్తూరు మొదలగు అనేక స్థలములందు వారి ప్రతిభను తెలియజేయు చిహ్నములు అనేకములు గలవు."

"పంజాబులోగల ప్రాముఖ్యత ఏమిటి ?"

"అయిదు నదులుగల దేశము. అందులకె ఆ పేరు వచ్చి నది. మహాసంగ్రామములు అనేకములు ఆరాష్ట్రమునందు జరిగి నవి. పాండవ, కౌరవులు కురుక్షేత్రములో చేసిన మహా యుద్ధముకూడ యీరాష్ట్రమునందే జరిగినది."

శేఖరు : "కాశ్మీరురాష్ట్రము అన్ని రాష్ట్రములలోను అంద మైనదని నేను విన్నాను."

"అవును. భారత దేశములో స్వర్గభూమివంటిది. మంచుతో వాసనలమించు పువ్వులతో మనోహరమైన ప్రకృతి సౌందర్యముతో భ్రమను కలుగజేయు నైసర్గిక దృశ్యములతో భూలోక స్వర్గమే కాశ్మీరు" అని నారాయణగారు అనిరి.

వీరిటుల మాటలాడుచుండగా రైలుబండి వింధ్యా సాత్పూరా కనుమలగుండా పోవుచుండెను. పిల్లలు ఆ కొండల అందమును తదేకదీక్షతో చూచుట కారంభించిరి. సాయం సమయమగునప్పటికి రైలు నర్మదానదిని దాటెను. కొంతవరకు బడలిక పిల్లలకు కల్గినది.

"ఢిల్లీ యింకా ఎంతదూర మున్నది?" అని అడిగిరి. నారాయణగారు "ఇప్పుడు మధ్యభారతము అనే పేరుగల రాజ్యము ప్రవేశించుచున్నాము. ఈ రాజ్యముకూడ మధ్య ప్రదేశమునందు ఇటీవల కలిసిపోయెను. ఈ రాజ్యము దాటు సరికి తెల్లవారును. ఉదయమందు ఉత్తరప్రదేశము ప్రవేశింతుము. తదుపరి మూడు గంటలకు ఢిల్లీ నగరము చేరెదము."

"మధ్యభారతమందు ముఖ్యమైన స్థలములు ఏమిగల"వని శేఖరం అడిగెను.

"ఝాన్సీ విషయమై నీవు వినలేదా? రాణీ లక్ష్మీబాయి రాజ్యముచేసిన నగరము."

"అవును. నాకు తెలుసును. బ్రిటిషు వారితో అతి ధైర్యముగా పోరాటము సల్పిన వీరురాలు." అని లీల అన్నది.

కాని రైలు ఆగినను పట్నము మాత్రము మనకు యిక్కడనుండి కన్పించదు. అదే విధముగా గ్వాలియరు నగరము

గూడ మనకు కన్పించదు. త్రోవలో భోపాల్ కలదు. అక్కడకు దగ్గరనే సాంచీవద్ద విశ్వ విఖ్యాతమైన బౌద్ధస్తూప మున్నది."

ఉదయము ఆగ్రానగరమునకు రైలు చేరెను. నారాయణ గారు "ఈ నగరమే మొగాలాయి చక్రవర్తికి రాజధాని నగరముగా ఉండెడిది. ఫతేపూర్ సిక్రీయందు ఆనాటికోట నేటికిని కలదు."

"అత్యద్భుతమైన తాజమహాలు ఇక్కడనేకదా కలదు ?" అని లీల అడిగినది.

నారా: "ఔనౌను, మన తిరుగు ప్రయాణమందు ఈ స్థలము లన్నింటిని చూడగలము."

మధుర చేరినప్పుడు ఇది భగవాన్ శ్రీకృష్ణునియొక్క జన్మస్థానమని నారాయణగారు పిల్లలకు చెప్పుదురు.

"అయినచో రాములవా రెక్కడ జన్మించిరి" అని శేఖరు అడిగెను.

"అయోధ్యయందు. అయోధ్యకూడ ఉత్తర ప్రదేశమందే కలదు. ఉత్తరప్రదేశములో కాశీ, ప్రయాగ, హరిద్వారము మొదలుగాగల పుణ్యక్షేత్రములు ఎన్నియో గలవు. పవిత్రము లయిన గంగా, యమునా నదులు ఈ రాష్ట్రమందే సంగమ మగుచున్నవి. ఒక మారుగ బహు పురాతనమైన మన భారత చరితమంతయు జ్ఞప్తికి వచ్చుచున్నది. వివిధమైన భాషల మాట లాడియు వేర్వేరు వేషముల ధరించియు అందరుకూడా సోద రులై భరతమాతకే తమ భక్తి ప్రణామములను అర్పించు చున్నారు."

ప్రకరణము 3

# ఢిల్లీ — మన రాజధాని

రైలుబండి న్యూఢిల్లీ స్టేషను చేరునప్పటికి ఉదయమయినది. నారాయణగారు కుటుంబముతోపాటు రైలుదిగి మోటారు కారులో ఒకబంగాళాకు వెళ్ళిరి. ప్రశాంతమైన ప్రాంతము అది. పార్లమెంటు సభ్యులయొక్క నివాసములు అచ్చటనే కలవు. కొన్నిరోజులు తెరిపిలేకుండగ ఢిల్లీనగరములోగల చరిత్రాత్మక చిహ్నములైన కోటలు, భవనములు మొదలగువానిని సందర్శించిరి. ప్రప్రథమమున వారు చూచినది కుతుబ్ మినారు. చాలాప్రఖ్యాతమైనది. త్రోవలో "పురానాఖిలా"గుండా వెళ్ళిరి. ఆస్థలమే ఒకప్పుడు ఇంద్రప్రస్థనగరము వున్నచోటు అని నారాయణగారు పిల్లలకు చెప్పిరి. పాండవులయొక్క రాజధాని.

"యీ కోట పాండవులే నిర్మించిరా" అని శేఖరు ఆశ్చర్యముతో అడిగెను. "గోడలు చాలా పాతవి. అనేకచోట్ల పడిపోయివున్నవి."

"లేదు. పురాతనమై, అందమై యుండిన ఆ యింద్రపస్థ నగరము ఏమియు ఇప్పటికి మిగలలేదు. ఆరోజులయందు నిర్మాణప్రశస్తి నొంది, ఉన్నతమైన ప్రాకారములతో వైశాల్యమైన రాజమార్గములతో, ఆశ్చర్యముగొల్పు సౌధములతో, మంటపములతో, పచ్చని మైదానములతో, హెచ్చైన భాగ్యము

కల్గిన దేవాలయములతో తులతూగుచుండెను. నేటికి మిగిలినవి యీ శిథిలమైన దేవాలీలు, కుడ్యములు మాత్రమే, పురాతన వైభవము చాటుచున్నవి. ఒకవేళ నిచ్చట భూగర్భమును త్రవ్వితిమేని మొహెంజోదారోలోవలె యిక్కడకూడను చక్కని పట్నముయొక్క చిహ్నములు దొరకగలవేమో !"

దానిపైన లీల "మహాభారత కాలమునాడు ఢిల్లీపట్నము మనకు రాజధానిగా నుండినదా ?"

"అవును. ఢిల్లీనగరము శాశ్వతనగరమని మనము పిలిచినను పిలవవచ్చును."

శేఖరు : "అయితే నాన్నగారు ! పాండవులు ఎప్పుడు యిక్కడ జీవించియుండిరి ?"

"ఎప్పుడు అని నిశ్చయమైన తేది చెప్పలేము గాని, షుమారు 5 వేల సం॥ క్రిందట అని చెప్పగలము."

"అయినయెడల యీకోటను ఎవరు కట్టిరి ?" అని నారాయణగారి సతీమణి అడిగినది.

"యిది యీమధ్యను 400 సం॥ క్రిందట హుమయూన్, షేర్ షా అను చక్రవర్తులు నిర్మాణముచేసిరి. స్థలము మాత్రము ఇంద్రప్రస్థమున్న స్థలము."

ఒక అరగంటలో వారు కుతుబ్ మినారు చేరిరి. పిల్లలు మినారు స్తంభమును పై భాగమువరకు ఎక్కిరి. ఢిల్లీనగరము యొక్క విశాలమైన రూపమును చక్కగ చూడగల్గిరి !

శేఖరు : "యిక్కడనుండి చూచుటకు ఎంతయో చక్కగ నున్నది" అని అనెను.

"యీ స్తంభముయొక్క ఎత్తు ఎంతయైయుండును ?" అని లీల అడిగెను.

నారా : "238 అడుగుల ఎత్తు కలదు. భారతదేశములో ఇంత ఎత్తైన స్తంభము మరియొకటి లేదు" అని జవాబు చెప్పిరి.

శేఖరు : "ఎంత సౌందర్యముగా నున్నది" అని సంతోషముతో అనెను.

లీల : "దీనిని ఎవరు నిర్మించిరి ?"

"ఢిల్లీలో రాజ్యము చేసిన మొదటి ముస్లిము రాజు హిందూరాజైన పృథ్వీరాజును ఓడించి ఢిల్లీ నగరమును జయించిరి. పిమ్మట 700 సం. వారి పరిపాలన సాగించిరి. పృథ్వీ రాజే ఈ స్తంభమును నిర్మించెనని చెప్పుదురు."

"తండ్రియజ్ఞదీక్షయం దుండగ తన గుర్రముపైని రాణి సంయుక్తను ఎత్తుకొని పోయిన రాజేకదా యీ పృథ్వీరాజు ?" అని లీల అడిగెను.

"అవును. ఢిల్లీ రాజ్యమును పరిపాలించిన కడపటి హిందూభూపతి అతను. మన మిప్పుడు నిల్చుని మాట్లాడు చున్న స్థలము అతని రాజధానిలోని భాగమే."

"కనుకనే కాబోలు, యీ శిథిల కట్టడములలో కొన్ని భాగములు హిందూ దేవాలయ మంటపములవలె కన్పించు చున్నవి"అని నారాయణ సతీమణి అనెను.

"అయినట్లయిన యీ మసీదు యిక్కడ ఎందుకుకలదు?" అని లీల అడిగెను.

"పృథ్వీరాజు ఓడించిన పిమ్మట ముస్లిము భూపతియైన కుతుబుద్దీను రాజధాని నగరమును, హిందూ దేవాలయము లను కొంతవరకు పడగొట్టి తన కోరిక ప్రకారము గృహ నిర్మాణము చేసెను. ఆతని రాజధానినగరముకూడ యిదియే."

శేఖరు : "నాన్నగారు! ఆ స్తంభము ఏమి ?"

అని ఎదురుగానున్న యినుప స్తంభమువైపు నడచుచు అడిగెను.

"లోకప్రసిద్ధమైన లోహ స్తంభము. పూర్వమున మనదేశ ములోగల లోహ విజ్ఞానమునకు, పనివానితనమునకును చిహ్నము యీ స్తంభము. అత్యాశ్చర్యమైనది. వందలకొలది సంవత్సరములనుండి ఎండ, వానలలో, వేసవి, చలికాలము, గాలి మొదలుగాగల అన్ని వాతావరణములలోను ఇదేవిధముగా నున్నది. ఏమాత్రమును త్రుప్పుపట్టలేదు."

"అవును. అది నిజముగ ఆశ్చర్యకరమైన విషయము." అని నారాయణగారి సతీమణి యనెను.

లీల : "ఈ స్తంభమును ఎవరు నిర్మించిరి? అని అడిగెను.

నారా : "చంద్రయను పేరుగల హిందూ భూపాలుడు విష్ణు భగవానుని గౌరవార్థము ఈ స్తంభము నిర్మించెను. "విష్ణులాద్" అనగా విష్ణు స్తంభమని దాని పేరు."

ఆ ఎదురుగా కన్పించుచు, సగము కట్టి వదలిపెట్టిన ఆ వలయాకారమైన నిర్మాణము ఏమి అని హాలాయీ మినార్ వైపు చూచుచు నారాయణగారి సతి అడిగెను.

"కుతుబ్ మినార్ యొక్క నిర్మాణానంతరము అల్లావుద్దీన్

ఖిల్జీ అను నామముగల ముస్లిము భూపాలుడు ఒకడు వుండెను. కుతుబ్ స్తంభము కన్నను ఎత్తయిన మరియొక స్తంభ మును నిర్మించుట కాతడూహించెను. కాని ఆ నిర్మాణము పూర్తికాలేదు. అతనియొక్క రాజధానియు ఇక్కడకు దగ్గర గనే అతను నిర్మించెను. పాతపట్నమును అంటిపెట్టుకొనే యిది యుండెడిది."

"అయినచో యీ శిథిలమైన కట్టడములు ఆ పట్నము యొక్క శిథిలములేనా ?"

"అవును. యింతియేకాదు. ఇతనితర్వాత వచ్చినరాజులు మరియొక రెండు పట్నములను కట్టిరి. అందుచేత నాల్గు ఢిల్లీ పట్నములు ఇక్కడ పుట్టినవి, నాశనమైనవి."

"ఇక ఢిల్లీ పట్నం విషయము చూచెదము." కుతుబ్ మినారు వదలి, ఫిరోజ్‌షా కోట్లా ఒక గంటలో చేరిరి. అచ్చటి శిథిలముల కొంచెము గమనించి అశోక స్తంభమును చేరిరి.

"ఈ స్తంభము ఏమి ?" అని శేఖరు అడిగెను.

"దీని పేరు అశోక స్తంభము. మన చరిత్రయందు ప్రఖ్యాతి గాంచిన అశోకచక్రవర్తి పేరు నీకు తెలియును గదా! 2 వేల సంవత్సరముల క్రిందట అతడు ఈదేశమును పరిపాలించెను."

"అవును. పరరాజులతో యుద్ధముచేయుట మానెదనని ప్రతిజ్ఞపూని అట్టి ప్రతిజ్ఞను నిలుపుకొనిన రాజు ఆ అశోకచక్ర వర్తియే కదా ?" అని శేఖరు అనెను.

"అవును. ప్రజలను పిల్లలవలె పోషించిన రాజు అశోక చక్రవర్తి. మంచిగాను, న్యాయముగాను జీవించిపరస్పరప్రేమతో

ప్రజలు భూతదయాపరులై జీవించవలెనని ఆచక్రవర్తియొక్క ఆశయము. సామ్రాజ్యములో అనేకస్థలములలో ఇట్టి స్తంభములను అతడు నిర్మించెను. ఔదార్యవిజ్ఞానములతో కూడిన తన ప్రబోధమును, శాసనములను ఆ స్తంభములపైన చెక్కించెను. ప్రజలు సులభముగా వాటిని తెలుసుకొని తమ నడవడిని సరిచేసుకొనెదరని అటుల ఆయన చేసెను. అటువంటి మహా చక్రవర్తి నిర్మించిన స్తంభములలో ఒకటి ఢిల్లీనగరమందు ఇప్పుడు కలదు" అని నారాయణగారు చెప్పిరి.

శేఖరు : "అశోకచక్రవర్తియే ఆ స్తంభమును ఈ ఢిల్లీనగరములో నిర్మించెనా ?"

"లేదు. అశోకుని యొక్క రాజధాని యిదిగాదు. అతని రాజధాని పాటలీపుత్రము. మన పూర్వచరిత్రలో ప్రతిభాప్రఖ్యాతులుగన్న మహానగరములలో పాటలీపుత్రము ఒకటి. ఆవిషయము ఇదివరలో మీకు నేను చెప్పియుంటిని గదా ! యిచ్చటకు పాట్నానగరము సుమారు 700 మైళ్ళ దూరములో గలదు. మనము చూచు ఈ స్తంభము ఉత్తరప్రాంతములలో ఎక్కడనో మొదట యుండెను. ముస్లిమురాజు ఒకడు దానిని యిక్కడకు తీసుకొనివచ్చి నిలువపెట్టెను. ఆరాజు, ఇక్కడ రాజ్యముచేసిన కాలములో అటుల జరిగెను. అది విని నారాయణగారి భార్య "అలాగునైన ఆ స్తంభము ఇప్పటి ప్రభుత్వ సౌధములకు ఎదురుగా తెచ్చి నిలబెట్టుట ఇంకను సమంజసముగ నుండును కదా!" అనెను.

నారా : "చక్కగా చెప్పితివి. ఇప్పుడు మనము పురానాఖిల్లాకు పోయెదము. 6 వ ఢిల్లీనగర నిర్మాణ స్థలము అది."

వీరు పురానాఖిల్లా చేరిరి. శిథిలావస్థలో నున్న గోడలు, సగము సగము బ్రద్దలై యున్న పెద్దతోరణములు చూచి షేర్ షా మసీదువద్దకు వచ్చిరి.

లీల : "ఈ మసీదును ఎవరు కట్టిరి ?" అని అడిగెను.

"షేర్ షా చక్రవర్తి. అతనే యీకోట కొంత భాగము కట్టెను."

"ఈకట్టడమేమి ?" అని శేఖరు రెండు అంతస్తులమేడను ఒకటి చూపించి అడిగెను.

నారా : "ఆకట్టడము పేరు షేర్ మండలము. హుమయూన్ చక్రవర్తియొక్క పుస్తక భాండాగారము. ఇచ్చటనే ఆ చక్రవర్తి మేడమెట్లు దిగుచు హఠాత్తుగా పడిపోయి కొన్నిదినముల పిమ్మట మరణించెను. ఆయనయొక్క సమాధి ఒకమైలులో అదిగో అటువైపు ఉన్నది" అని నారాయణగారు ఆ సుందర సమాధిని దూరమునుండి చూపించిరి.

తరువాత వీరు ప్రాతఢిల్లీనగర ప్రాంతములోనున్న లాల్ ఖిల్లా అనే కోటను చేరుకొనిరి.

"ఈకోట మంచి మరమ్మతులో నున్నది" అని శేఖరు అనెను.

ఉన్నతమైనవి, విశాలమైనవి అయిన కోటబురుజులను, త్రోవలనుచూచి అందరు మెచ్చుకొనిరి.

"ఈ కోట నెవరు కట్టిరి?" అని లీల అడిగెను.

"షాజహాను. భూతల ప్రఖ్యాతమైన తాజ్ మహాలును ఆగ్రాలో కట్టించిన చక్రవర్తి అతనే."

"ఓహో! అందమునకు రాణియైన ముంతాజుయొక్క భర్త షాజహానుకదూ?" అని లీల అనెను.

"అవును. ఆశ్చర్యకరమైన కట్టడములను అనేకములను అతను కట్టెను. ఈ కోటలోపల మనము చూడగలము అని నారాయణగారు చెప్పిరి."

అందరు లోనికి నడిచిరి.

మొదట దివానీ ఆమ్ అను కట్టడము చూచుటకు వెళ్ళిరి. అది యీ రోజులలో మనము దర్బారుహాలు అని అందుము. అచ్చటచక్రవర్తి చిన్న, పెద్ద, అను విచక్షణలేకుండా యావన్మంది ప్రజలకు సందర్శనము నిచ్చు సభాభవనము.

"ఈ కనుపించుచున్న ఈ చలువరాతి కట్టడము ఏమి?" అని లీల అడుగుచు ఆ మంటపమునకు ఒక ప్రక్కనున్న తెల్లని చలువరాతి సింహాసనము దగ్గరకు వెళ్ళెను. అది ఎత్తుగా లోనుండి త్రోవగల్గినది. అతి చమత్కారముగా పుష్పములు, పక్షులు మొదలయిన వానితో చెక్కబడి యుండెను.

నారా: "అది ప్రతిదినముసు చక్రవర్తి కూర్చుండు వేదిక. పౌరులు చేసుకొను విన్నపములను ఆ వేదికపైన కూర్చుని వినువాడు. లోపల మరియొక పెద్ద మంటపము వున్నది. ఇంతకన్నను అందమైనది. అంతయు చలువరాతితో కట్టినది. నడువండి." అనగా అందరు లోపలికి వెళ్ళిరి.

లీల, శేఖరు ఈ అందమైన దృశ్యమును మౌనముతో చూచిరి. "మనము చూచినదా నన్నింటిలో యిదే అందమైనది" వారు అనుకొనిరి.

నారా: "ఇప్పుడు మనము వచ్చినది దివానీఖాస్ ఇది ప్రత్యేక పౌరులకు సందర్శన మిచ్చు సభాభవనము. చక్రవర్తి ఇక్కడ సామంతులకును, పౌర ముఖ్యులకును తన సందర్శన మిచ్చెడివాడు."

"ఆపైని వ్రాసిన అక్షరములు ఏమి ? వాని అర్థమేమి ?"

"భూలోకమున స్వర్గ మున్నయెడల అది యీ సభా భవనమే అని దాని అర్థము."

లీల: "అయినచో అది నిజమే అగును" అని అనెను.

నారా: "షాజహాను చక్రవర్తి కాలమందు ఇంతకన్న హెచ్చైన వైభవముతో ఈ మందిరము ఉండెను. ఈ స్తంభము లన్నింటియందుకూడ వజ్రవైడూర్య రత్నములు అతుకబడి యుండెడివి. మందిరముయొక్క కప్పుభాగము బంగారపు రేకుతో కప్పబడి ఆ రేకుపైని వెండి బంగారములు ఆకులు తీగలవలె అతికింపబడి యుండెను."

"ఆ రత్నములు, ఆ బంగారము ఇప్పుడు ఏమైనవి ?"

"ఢిల్లీపట్నముపై దాడిచేసినవారు వానిని ఎత్తుకొని పోయిరి."

"అయ్యో ! ఎంతపని అయినది" అని లీల అనెను.

"ఈ మధ్యభాగములో వేదిక ఏమి ?" అని శేఖరు అడిగెను.

షాజహాను చక్రవర్తి అధిష్ఠించియుండిన సింహాసనము ఆవేదికపైన ఉండెడిది. ఆసింహాసనము బంగారముతో చేయబడినది. నెమలితోక రూపమున్నచోట పచ్చలు, కెంపులు, మంచి ముత్యములు మొదలగు అమూల్యమైనవి అందు తాపించబడియుండెడివి. ఆసింహాసనముయొక్క ఖరీదు 16 కోట్లకు పైగానుండును."

"అయితే ఆసింహాసనము యిప్పుడు ఎక్కడ వున్నది?"

"నాదర్షా అను పర్షియాదేశపురాజు ఢిల్లీపై దండెత్తివచ్చి పట్నమును కొల్లగొట్టి 200 సంవత్సరములక్రిందట ఆ సింహాసనమును ఎత్తుకొనిపోయెను."

తరువాతను ఖాస్ మహాలులోనికి వెళ్ళిరి. అనగా చక్రవర్తి నివసించు భవనపుగదులు. రంగ్ మహాలు, మోతీమసీదు కూడా చూచుటకు వెళ్ళిరి. పిమ్మట షాజహానుచే నిర్మింపబడిన జుమ్మామసీదు చూచిరి. ఆపిమ్మట ఢిల్లీనగరమునకు పెద్దబజారైన చాందినీచౌక్ చూసిరి. ఈమార్గమే షాజషానుచక్రవర్తి కాలములో నగరమున నుండిన పెద్ద రాజవీధి. ఇచ్చటనే వేలకొలది జనములను హత్యచేసి నాదిర్షా వారి ఆస్తులను కొల్లగొట్టిపోయెను.

బహుజనములతో నిండియున్న ఆవీధులను దాటి న్యూఢిల్లీ అను పేరుగల నూతన పట్టణప్రాంతమునకు వెళ్ళిరి. న్యూఢిల్లీ నగరమును బ్రిటిషు ప్రభుత్వమువారు నిర్మించిరి. పిమ్మట లక్ష్మీనారాయణ మందిరము, జంతర్ మంతర్ మొదలుగాగల

ప్రేక్షణీయములైన యితర స్థలములను చూచి యింటికి చేరు కొనిరి.

మరునాటి ఉదయము రాజఘాట్‌కు వెళ్ళి గాంధీగారి సమాధిపైన పూలమాలను భక్తితో అర్పించిరి. అచటనుండి సెక్రటేరియట్ అని పిల్వబడే ప్రభుత్వపు సౌధములను, ఆపిమ్మట రాష్ట్రపతిభవనము, ఉత్తరబ్లాకు, దక్షిణబ్లాకు అని పిలువబడు భవనములను వారు చూచిరి.

నారాయణగారి భార్య "ఈభవనములన్నియు బాగుగా ఉన్నవి" అని కొంచెము ఎత్తైన స్థలమునందు నిలిచి అన్నింటిని చూచుచుండెను.

"ఇది అత్యద్భుతమైన దృశ్యము. సందేహము లేదు. ఇచ్చటకు మన ప్రాతరాజధానియైన ఇంద్రప్రస్థముండిన స్థలము కన్పించు"నని చెప్పి ఆప్రక్కకు చూపించిరి.

"ఈభవనములను ఎప్పుడు కట్టిరి ?"

"బ్రిటిష్ ప్రభుత్వమువారు వీనిని కట్టినారు. సర్ ఎడ్విన్ ల్యూట్యెన్స్, సర్ ఎడ్వర్డ్ బేకర్ అను ఇద్దరు ప్రఖ్యాత వాస్తు శాస్త్రజ్ఞులు, ఎనిమిదవ పట్టణమైన ఈ న్యూఢిల్లీ నగరమును నిర్మాణముచేసిరి. సుమారు నలుబది సం. క్రిందట పని ఆరంభమై పని పూర్తియగుటకు 18 సంవత్సరములు పట్టెను. వందలకొలది గదులు ఈ భవనమందు కలవు. రాష్ట్రపతి భవనమందే 350 గదులు కలవు."

"దానికి రాష్ట్రపతి భవనముని పేరు ఏల కల్గెను ?"

"ఇది రాష్ట్రపతిగారు నివసించు భవనము. పూర్వము బ్రిటిషు ప్రభుత్వమువారి రోజులలో ఇది వైస్రాయి భవనము. చాలా అందమైన తోట లోపల గలదు. ఆ తోటపేరు మొగలాయి తోట. మరియొక దినమున మనము చూడగల్గుదుము" అని నారాయణగారు చెప్పిరి.

ప్రకరణము 4

## పూర్వము భారతదేశముననుండిన ప్రజారాజ్యము

"నిన్నను 1853 సం. శాసనసభను బ్రిటిష్‌వారు నిర్మాణము చేసితిరని మీరు చెప్పిరి. అంతకుపూర్వము మనదేశ మందు పార్లమెంటు లేకుండనే ఉండెడిదా?" అని మరునాడు శేఖరు తండ్రిని అడిగెను.

'ఈప్రశ్నకు ప్రత్యుత్తరము చెప్పుట కొంచెముకష్టమ'నిరి.

"అఖిల భారతదేశమునకును, ఇప్పుడు మనము చూచు పార్లమెంటువంటిది ఆనాడు మనదేశమున లేదు. అయినను ప్రజాప్రతినిధుల పరిపాలనతో గూడిన రాజ్యము ఆ రోజులందు ఉండెడిది."

"అయితే రాజులు చక్రవర్తులు మనదేశమున పరిపాలించు చుండిరని వింటిమి కాని ప్రజలచే ఎన్నికగన్న అధ్యక్షులు ఉండి నట్లు మనము వినలేదే ?" అని లీల అనెను.

"నిజమే. రాజులు, చక్రవర్తులే సాధారణముగా మన దేశమును పాలించెడివారు. అయినను ఆ రాజులు, చక్రవర్తులు నిరంకుశాధికారులు కారు. ధర్మము ననుసరించి, మంత్రుల సలహాల ననుసరించియు వారు రాజ్యమును నడిపించెడివారు. ఇంతియేకాదు. రాజుల పరిపాలనా విధానమే దేశమందంతట ఉండెనని అనుకొనుటకును వీలులేదు. కొన్ని రాజ్యములందు

ఆధునిక కాలములో వలెనే పరిపాలకులను ప్రజలే ఎన్నుకొను టయు కూడ కలదు."

"ప్రజాప్రాతినిధ్యము వహించిన ప్రభుత్వము మన దేశము నందు ఎప్పుడు ఉండె"నని ఆతురతతో శేఖరం అడిగెను.

"ఋగ్వేదకాలము అయిన బహుపురాతన కాలమందు కూడ అట్టి ప్రజాప్రతినిధి రాజ్యవిధానము ఉండెడిది. ఇదికాక మరియొక విధానము కూడా ఉండెను. రాజులు కూడ ప్రజల వలన ఎన్నుకొనబడెడివారు. ఆనాటి పవిత్ర మతగ్రంథములు చదివినయెడల, సమితి అనే పేరుగల ఆలోచనాసభలు ఉండెడి వని తెలియగలదు. తర్వాత సంహితలు బ్రాహ్మణములు కూడ ఈ విషయములనే రుజువు చేయుచున్నవి."

"రాజులు పరిపాలించు రాజ్యవిధానముకాక మరియొక రాజ్యవిధానముగూడ ఉండెనని మీరు చెప్పితిరి. అట్టి రాజ్య ముల పేర్లు కొన్నింటిని చెప్పెదరా?" అని నారాయణగారి భార్య అడిగెను.

"అలాగుననే. క్రీస్తు పూర్వము 6 వ శతాబ్దములో లిచ్ఛవులు, శాక్యులు, మల్లులు మొదలుగాగల ప్రజాగణములు అట్టి గణతంత్ర రాజ్యవిధానమున పరిపాలన చేసికొనిరి. అందులో లిచ్ఛవులు అతి శక్తివంతులై పురాతన భారతదేశ మున హెచ్చైన పేరుప్రతిష్ఠలుగనిరి."

"ఈ గణతంత్ర రాజ్యములు ఏ విధమున పరిపాలన సల్పు కొనిరి?" అని శేఖరు అడిగెను.

"ఈ రాజ్యముయొక్క విధానవివరముల గూర్చి మనకు నమ్మదగిన ఆధారములు దొరకలేదు. ఇదియే మన అవస్థ. వివరములు మనకిపుడు తెలియవు. రాజ్యమంతయు కొన్ని పరిపాలనా మండలములక్రింద విభజనమై అట్టి మండలములందు స్థానికమైన పరిపాలన ఏర్పాటులు ఉండెనని తెలియుచున్నది. మొత్తముపైన ఈ రాజ్యకార్య నిర్వహణమంతయు ఒక సభచే జరుపబడినది. అట్టి సభకు ఈ మండలాధికారులే సభ్యులు. వారు కార్యక్రమమును సక్రమముగా నడిపించుకొనుటకు ఒక నాయకుని లేక అధ్యక్షుని ఒక నిర్ణీత కాలము వఱకు ఎన్నుకొనుచుండిరి. పరిపాలన మొత్తము ఈ మండలాధిపతులతో గూడిన సభయొక్క ఆలోచన నిర్ణయములపైని జరుగుచుండెను. ఈ సభకు ఒక అధ్యక్షుని ఎన్నుకొనువారు. ఆ అధ్యక్షుపదవి కొన్ని సంవత్సరములకు మాత్రము నిర్ణీతముగ నుండెడిది. ఈ సభ బాహుళ్యముగనున్నప్పుడు అందులోనుండి కార్య నిర్వహణకు ఒక చిన్న సభను ఏర్పరిచెడివారు.

సంతాగారమను పేరుగల భవనమందు పెద్దలు చిన్నలతో కూడిన ఈసభ సమావేశము అగుచుండెను. బుద్ధభగవానుడు ఈ సభలను చూచి హెచ్చుగా మెచ్చుకొనెను. తన మత సంబంధమైన సంస్థలనుకూడ ఈ రాజకీయసభల నిబంధనల ననుసరించియే బుద్ధభగవానుడు నిర్మించుకొనెను."

"పూర్వకాలమందు మనదేశమున అధ్యక్షులు పార్లమెంటును గలవని వినుటకు అతి సంతోషముగ నున్నది." అని శేఖరు సంతోష గర్వములతో అనెను.

"ఈసభ విషయమై ఇంతకుమించిన వివరములు మనకు తెలియనే తెలియవా?" అని మరొకమారు ఆతురతతో అడిగెను.

"న్యాయపరిపాలన విధానమును గురించి కొంచెము తెలియును.

ఏడు న్యాయకూటములు వరుసగా ఒకదాని తర్వాత నొకటి ఒక మనిషి నేరముచేసెనని నిర్ణయించినగాని ఏ మనిషిని కూడ శిక్షించుటకు వీలులేదు. ప్రజలయొక్క స్వాతంత్ర్యమన్న అంత గౌరవము ఆనాడుండెను."

"ఆవిధాన మెటుల జరిగెను నాన్నగారూ?" అని శేఖరు అడిగెను.

నారా : "ఎవనిపై నైనను నేరారోపణము చేయబడినయెడల ఆ ముద్దాయిని మొదట విచారించి, మహామత్త అను ఉద్యోగుల ఎదుటపెట్టి వారు నిర్దోషి అని నిర్ణయించి వదిలివేయుట, కాక దోషియని నిర్ణయించి వారిపై అధికారముగల ఉద్యోగ బృందము ఎదుట పెట్టెడివారు. యీ విధముగా మొదటి ఆరు ఉద్యోగబృందములు వరుసలో దోషియని నిర్ణయించినట్లయిన 7 వ ఉద్యోగ బృందము ఎదుటకు ముద్దాయివెళ్లుట జరుగును. ఏడవ ఉద్యోగ బృందమనగా గణతంత్రముయొక్క అధ్యక్షులు. శిక్షవిధించుటకు వారికి ఒక్కరికే హక్కు. శాసనము ప్రకారము శిక్షించుటయే ఆయనకుగల హక్కు లోకములో మరెక్కడను ఇంత జాగ్రత్తతో వ్యక్తి స్వాతంత్ర్యము భద్రము చేయబడినట్లు కనుపించదు."

"ఇంత చక్కటిపద్ధతి ఎప్పుడు తప్పిపోయెను ?" అని లీల అడిగెను.

"క్రీ॥ శ॥ నాల్గవ శతాబ్దము వరకును ఇట్టి విధానముండె నని తెలియుచున్నది. ఈ గణతంత్ర రాజ్యములేకాక సామం తుల సభలే పరిపాలకులుగా గల రాజ్యములుకూడ కొన్ని యుండెడివి. ఒకప్పుడు 5 వేల సభ్యులుగల పరిపాలనావర్గము కూడ వుండియుండెను. కాని మౌర్య సామ్రాజ్యము ఏర్పాటైన తర్వాత చంద్రగుప్తుడు, అశోకుడు తమ సామ్రాజ్యములోనికి ఈ గణతంత్ర రాజ్యములను కలిపివేసుకొనిరి."

"తర్వాత గణతంత్ర రాజ్యవిధానము పోయెనా ?" అని శేఖరు అడిగెను.

"మౌర్యసామ్రాజ్య పతనానంతరము మరల గణతంత్ర పరిపాలనా విధానము పునర్జన్మ పొందెను. ఔధేయులు, మాలవులు, అర్జునాయనులు, అని పేరుగలవి ప్రబలెను. కాని తిరిగి సముద్రగుప్తుని రాజ్యము విస్తృతమైనపుడు వాని ప్రాముఖ్యత పోయెను. అందుచేత క్రీ. శ. 5 వ శతాబ్దము పర్యంతము ప్రజాతంత్ర, గణతంత్ర రాజ్యవిధానములు మన దేశమునందు ఉండెనని చెప్పగలము."

"అట్టివి యిప్పటివరకు లేకుండుట మన దురదృష్టము కదా ?" అని లీల అనెను.

"అవును. తదనంతరము మన దేశీయ జీవనమందు అనేకములైన విషయములు కలిసి అట్టి గణతంత్ర రాజ్య విధాన పునర్నిర్మాణము కాకుండ చేసినవి. రాజ్యము రాజులే చేయ

వలెనన్న భావము ప్రబలినది. విదేశములనుండి యితర దేశీయులు చేసిన దండయాత్రలు, వారు పొందిన విజయములు దేశమున అశాంతిని వ్యాపింపజేసి పరదేశీయుల ప్రాబల్యము నెదిరించుటకు బలమైనటువంటి రాజు ఉండినగాని రాజ్యపరిపాలన గట్టిగ నుండదను భావముకూడ పెరిగెను. పరదేశీయుల దాడులు కొన్ని శతాబ్దములలో జరిగి, చివరకు ముస్లిము పరిపాలన స్థాపింపబడినది. ఆపైని మొగలాయి సామ్రాజ్య సంస్థాపనము జరిగినది; 18 వ శతాబ్దమువరకును అటులు మన చరిత్ర నడచెను."

"ఆ కారణముచేతనా మనకు గుప్తసామ్రాజ్యము పిమ్మట ప్రజాతంత్ర రాజ్యము లేకుండ యుండిన"దని శేఖరు అడిగెను.

"అలాగునకాదు. అట్టి రాజ్యపరిపాలనా విధానము పైవరకును లేకపోయినను గ్రామస్థాయిని ప్రజాతంత్ర రాజ్యము స్థానికముగ జరుగుచుండెను. బ్రిటిష్‌ప్రభుత్వము ఏర్పాటు అయినవరకు కూడ గ్రామములలో ప్రజారాజ్య విధానము సజీవముగనే యుండెను."

"అలాగుననా! అట్లయిన గ్రామములందు స్వపరి పాలన యుండెనా?" అని లీల అడిగెను.

"ఇప్పటి పంచాయితీ విధానమా?" అని శేఖరు ప్రశ్నించెను.

"అవును. రమారమిఅటులనే. అయితే పూర్వకాలమందు పంచాయితీలకు ఇప్పటి పంచాయితీలకన్న హెచ్చు అధికార ముండెను. దక్షిణదేశమందు దొరకిన చోళ, పాండ్య శిలాశాసన

ములలో గ్రామములందు జరుగు స్థానిక పరిపాలనా విధానము అనేకమార్లు ప్రస్తావింపబడి యున్నది. స్థానిక పరిపాలనకు ఒక గ్రామము చిన్నది అయినయెడల కొన్ని గ్రామములు కలిసి జరుగుచుండెడిది. అట్టి సముదాయమునకు ఒక సభయుండెడిది. కొన్ని గ్రామములయందు వయసువచ్చినవారందరు సభ్యులుగ నుండెడివారు. కొన్ని గ్రామములందు అట్టివారిచే నెన్నుకొనబడిన ప్రతినిధులు సభ్యులుగ నుండెడివారు. రాజుగారి ఉద్యోగస్తుల పర్యవేక్షణకు లోబడి గ్రామపరిపాలన యావత్తును, ఈ సభ చేతులయందే యుండెడిది.

బాటలు నిర్మించుట, జన సామాన్యమునకు అవసరమగు కట్టడములనుకట్టుట, వాటిని సరిగనుంచుట, దేవాలయ నిర్మాణము, శాసనక్రమముగ సుశిక్షితముగ గ్రామమందు ప్రజల కార్యక్రమములు జరుగునట్లుచూచుట, గ్రామస్థులకుగలవివాదములను తీర్చుట, దేవాదాయము, ధర్మాదాయము జరిగించుట, వాణిజ్యావర్తకములకు ఏర్పాటులు చేయించుట, మొదలుగాగలకార్యములును ఈ సభ యాజమాన్యమునందుండెడివి. ఉపసంఘముల నేర్పాటుచేసుకొని, కార్యవిభాగ మొనరించుకొని పై వివరించిన పనులన్నింటిని గ్రామసభలునిర్వహించెడివి. మంచివారు, తగినవారు ఆ సంఘములందు సభ్యులుగఎన్నికై కార్యభారము పూనుకొనెడివారు. ఇదివరలో ఏ సంఘ సభ్యులు కానివారుండిన అట్టివారిని వచ్చే ఎన్నికలలో ఎన్నుకొనువారు. ఆ కారణముచేత ప్రతి పౌరునకునుగూడ గ్రామ హితోపకారములగు కార్యము

లను చేయుటకు అవకాశముండెడిది. ఆ సంఘములందు స్త్రీలుకూడ సభ్యులుగ నుండుట కలదు."

"అట్లయిన ఆరోజులందు మన రాజ్యవిధానము చక్కగా ప్రజాతంత్రసూత్ర మవలంబించి నడుచుననదన్నమాట" అని లీల అని "తిరిగి ఆ సత్పద్ధతి మన గ్రామములందు మనకు స్వాతంత్ర్యము వచ్చినది గనుక పునః ప్రతిష్ఠాపన కాగలదని అనుకొనగలముకదా!" అనెను.

ప్రకరణము 5

# పార్లమెంటు పుట్టి పెరుగుట

"పార్లమెంటు మన దేశమునందు ఏవిధముగా పుట్టి పెరిగినదో చెప్పండి." అని శేఖరు, లీల తండ్రిని మరునాడు అడిగిరి.

"ఇప్పుడు మనము పార్లమెంటు అనుకొను సంస్థ యొక్క ఆరంభము బ్రిటిష్ ప్రభుత్వమువారు మన దేశమునకు వచ్చిన పిమ్మటనే జరిగినది. పురాతన కాలమందు ప్రాతినిధ్యముతో కూడిన ప్రజా పరిపాలనము యుండెనని యిదివరలోనే చెప్పియుంటిని. వేదముల కాలమునందుగూడ సభలనియు, సమితులనియు ఉండెను. ఎన్నికల విధానముగూడ అచ్చటచ్చట ఉండెను. ఒకప్పుడు ఎన్నికపైన రాజులు రాజ్యములను చేయుచుండిరి. కొన్ని రాజ్యములందు రాజులుండెడివారుకారు. అక్కడ గణతంత్ర రాజ్య విధానము అమలునందుండెడిది. వేదములు, రామాయణము, మహాభారతము మొదలుగాగల మన పవిత్ర గ్రంథములయందు ఈ సంగతులు వివరింపబడినవి." అని నారాయణగారు చెప్పిరి.

"ఇవన్నియు ఏమైనవి? నేడేల కన్పించవు?" అని నారాయణగారి సతీమణి ప్రశ్నించెను.

"హిందూరాజులు, చక్రవర్తులు రాజ్యముచేయు కాలమందు చాలకాలము అట్టి సభలు ఉండెడివి. ముస్లిము పరిపాలన స్థిరపడిన పిమ్మట ఈ సభలు క్రమముగ అంతరించినవి. అయినను గ్రామములందు మాత్రము గ్రామ పంచాయితీలని మిగిలెను. కేంద్రముననున్న రాజుగాని అతని అధికారులుగాని సాధారణముగా వాని వ్యవహారములందు జోక్యము కలుగ చేసుకొనువారుకారు."

నారాయణగారి భార్య "ఆ పంచాయితులుకూడ యిప్పుడు కనపడవేల?" అని ప్రశ్నించెను.

బ్రిటిషు ప్రభుత్వము వచ్చినతర్వాత పరిపాలనాధికారము సర్వమును కేంద్రీకరింపబడి అట్లె పంచాయితీల ప్రాముఖ్యతయు తగ్గిపోయెను. ఈ ప్రకారముగా మనదేశములో ప్రజాతంత్ర రాజ్య విధానము రానురాను నాశనమయ్యెను."

"సరి. ఇప్పటి పార్లమెంటు ఏవిధముగా పుట్టినది?" అని శేఖరు అడిగెను.

"గత శతాబ్ద మధ్య కాలమునాటికి యావద్భారత దేశము తూర్పిండియా కంపెనీవారియొక్క యాజమాన్యము క్రిందకు వచ్చెను. ఒక చిన్న కార్యనిర్వాహక సంఘముతోపాటు దేశము నంతటను ఒకే గవర్నరు జనరలు పరిపాలించువాడు. 1853 వ సంవత్సరమున మరికొంతమంది సభ్యులను కార్య నిర్వాహక వర్గమునకు కలిపి విస్తృతముచేసి దేశము పరిపాలించుటకు కావలసిన శాసనముల చేయు అధికారముతో శాసనసభ

(Legislative Council) ఒకదానిని ఏర్పాటుగావించిరి. ఆ శాసన సభయే మనయిప్పటి పార్లమెంటు యొక్క మొదటి రూపము."

"ఆ సభలో గల సభ్యులను ప్రజలు ఎన్నుకొనువారు కారా ?"

"లేదు. అప్పటి కాలమందు ఎన్నికలు లేవు. ఎన్నుకొను హక్కు గూడ ప్రజలకు లేదు. మన దేశము సంగతి గాని మన ప్రజల విషయములు గాని అప్పటి పరిపాలకులకు సరిగ తెలిసిన విషయములు గావు. అసలు వారిదేశమైన ఇంగ్లండునందే ఆ రోజులలో వోటింగు హక్కు తక్కువగానుండెడిది. ఇంతియే కాక 1857 సంవత్సరమున మనదేశమునందు ప్రథమ స్వాతంత్ర్యసమరము ఆరంభమయ్యెను. ఈ సమరము ఆగిన పిమ్మటనే పరిపాలనము తూర్పు ఇండియా కంపెనీనుండి బ్రిటిషు మహారాజ్ఞికి సంక్రమించెను. అప్పటి యింగ్లండుదేశపు రాణిని, ఇండియా మహారాజ్ఞి అని పిలుచుకొనేవారు. ఆమె తర్వాత వచ్చిన ఇంగ్లండు రాజులు గూడ యిండియా చక్రవర్తులని వ్రాసుకొనువారు."

"ఇంగ్లండులోనుండి మనదేశమును వారు ఎట్లు పరిపాలింపగల్గిరి" అని లీల అడిగెను.

"వారు వారి రాజప్రతినిధిగా వైస్రాయి అను యొక నుద్యోగిని యిక్కడకు పంపి అతని ద్వారా రాజ్యము సాగించెడివారు. ఆతనికి సలహాల నిచ్చుటకు మరికొంతమందిని కూడ నియమించెడివారు."

"వారు ప్రజలవలన ఎన్నికయినవారేనా ?" అని శేఖరు అడిగెను.

"కాదు. వారికేఎన్నికయు లేదు. ప్రజలయెడల జవాబుదారీ కూడ లేదు. ఈ శాసనసభలో కొద్దిమంది సభ్యులు మాత్రమే నియామకమై యుండెడివారు. వారికి అధికారము చాలా తక్కువగా యుండెడిది. రాజ్యపరిపాలనా పద్ధతియందు ప్రజల ప్రమేయమే లేదు. ప్రభుత్వము యొక్క కార్యనిర్ణయములను మార్పుచేయుటకు ఎట్టి సాధనమును ప్రజల వశమునందు లేకుండెను. ఆ కారణముచేత 1885 సంవత్సరము నాటికి దేశాభిమానముగల మాననీయులు కొందరు అఖిలభారతజాతీయ కాంగ్రెసు (Indian National Congress) అనుసంస్థను ఏర్పాటు గావించిరి. ఈ సంస్థయే కొంత కాలము తర్వాత బ్రిటిషు సామ్రాజ్యము నెదిరించి యిండియా స్వాతంత్ర్యమును సంపాదించిన సంస్థ. మొదట ఏర్పాటు అయినపుడు మాత్రము శాసన సభల యందు ఎన్నికలలో గెలిచినవారు మాత్రము శాసన సభ్యులుగా నుండి శాసన విధానమును ప్రజాభిప్రాయము ప్రకారము జరుగునటుల చేయుటే వీరి ప్రథమాశయము."

"ఏ విధముగా కాంగ్రెసు ఈ ఆశయములను సాధించగ్గలెను ?"

"ప్రతి సంవత్సరము సమావేశములు జరిపి ప్రజలయొక్క అవసరములను విజ్ఞప్తిపూర్వకముగా ప్రభుత్వమునకు అందజేసెడివారు."

"ప్రభుత్వమువారు ఆ విజ్ఞప్తులను మన్నించెడివారా ?"

"లేదు. అంత సులభముగా కార్యమగునా? కాని ఏ చేట తప్పకుండా యిట్టి కోరికల పత్రములు నివేదించుటవలన ప్రభుత్వము కొన్ని సంస్కరణలను విధిగా చేయక తప్పినదిగాదు. 1892 సంవత్సరములో శాసనసభను విస్తృత పరుచుట జరిగినది. అందు దేశములోగల కొన్ని సంస్థలకున్నూ, స్థానిక పరిపాలనా సంస్థలకున్నూ ప్రాతినిధ్యము ఇచ్చిరి."

"ఈ ప్రతినిధులు ప్రజలచే ఎన్నుకొనబడిన వారేనా?"

"కాదు. ఒకరునుకూడ అందు ఎన్నికైనవారు కారు. రాజప్రతినిధి (Viceroy) వీరినికూడ యితర సభ్యులవలెనే నియామకము చేసెడివారు. ఎటువచ్చి ఏ వియో స్థానికసంస్థల యొక్కయు సలహాపైని ఆ నియామకము జరిగెడిది."

"ఇట్టి సంస్కరణలు కాంగ్రెసునకు సంతృప్తి కరముగ నుండినవా?"

"ఎంతమాత్రము లేదు. సపరిపాలనముకన్న స్వపరిపాలనమే వాంఛనీయమని వారనుకొనెడివారు. అట్టి వాతావరణమందే స్వరాజ్యమను భావబీజము అంకురించెను. 1906 వ సంవత్సరమున అట్టి స్వరాజ్యసంపాదనమే కాంగ్రెసు సంస్థయొక్క ఆశయమని నిర్వచనము జరిగెను. అయితే స్వరాజ్యమనిన కొంత మందికి బ్రిటిషు ప్రభుత్వమును తప్పించి సంపూర్ణస్వాతంత్ర్యమని యర్థము తోచినది. మరికొంతమందికి బ్రిటిషు పరిపాలన యాజమాన్యమున బాధ్యతాయుతమైన స్వపరిపాలనమని తోచినది. తత్ఫలితముగా కొందరు సంపూర్ణ స్వాతంత్ర్యమునకును మరి

కొందరు బ్రిటిషు సామ్రాజ్యములో బాధ్యతాయుత స్వపరి పాలనమునకునై ప్రచారము, ఆందోళనము గావించుచుండిరి."

"రెండవ దానికైనను బ్రిటిషు ప్రభుత్వమువారు ఒప్పు కొనిరా ?"

"అదియును లేదు. అసలు శాసనసభల యందుండు సభ్యులు ప్రత్యక్షముగా ప్రజలవలన ఎన్నిక కావలయునన్న పద్ధతికే వారంగీకరించలేదు. 1919 సంవత్సరమందు శాసనసభ విస్తృత పరుచుటకును, ఆ విస్తృతమైనదానియందు ఇదివరలో కన్న మరికొన్ని సంస్థలు పరోక్షపు ఎన్నికల మూలమున ఎన్నుకొనుటకుమాత్రము ఆ బ్రిటిషు ప్రభుత్వము అంగీకరించినది. శాసనసభకు కొంచెము హెచ్చు అధికారముగూడ యిచ్చుటకు అంగీకరించెను. రాజప్రతినిధియొక్క కార్యనిర్వాహక సంఘము నందు మన దేశీయుని ఒకనిని నియమించుటకుకూడ అంగీకరించిరి. అటుల చేయబడినది."

"మనవారు అడిగినదానికిని దీనికిని చాలా అంతర మున్నదే ?" అని శేఖరు అనెను.

"అవును. అంతియే కాదు, ప్రభుత్వమువారు అప్పుడు అవ లంబించిన కార్యక్రమములు కొన్ని ప్రజలకువ్యతిరేకాభిప్రాయము కల్గించినవి. అందుచేత యీ ప్రభుత్వమును బలవంతముగా పడదోయుటకుకూడ అనేకమంది ప్రజలలో అభిప్రాయము కల్గెను. విప్లవసంస్థ లనేకములు దేశమందంతటను ఉద్భవించి బ్రిటిషువారిపైని బాంబులు వేయుట, తుపాకులతో పేల్చుట,

వారిని చంపుట మొదలగు కార్యక్రమములు ఆ సంస్థలు పూను కొనినవి."

"బ్రిటిషు వారికి వీనివలన ఒక గుణపాఠము కాలేదా ?"

"బ్రిటిషు ప్రభుత్వము అతి బలవంతముగా నున్న విషయము మనము గుర్తునందుంచుకొనవలెను. బలవత్తరమైన సైన్యము, పోలీసు సిబ్బంది వారి అధికారముక్రింద నుండెను. వారు ఇట్టి ఆందోళనలను అణగద్రొక్కుటకు సహాయపడుచుండిరి. ఇంతియే కాక అనేకమందిని కారాగృహములందు బంధించెడివా"రని నారాయణగారు చెప్పిరి.

"చాలా ఘోరమైన పరిస్థితికదా ?" అని లీల అనెను.

"అవును. కాని ప్రజలుమాత్రము దృఢనిశ్చయముతో బాధలకు లోనైనా తమ కార్యము సాధించుకొనుటకు పూనుకొనిరి. ఆందోళన క్రమక్రమముగా హెచ్చాయెను. దేశమునం దశాంతి ప్రబలెను. 1919 వ సంవత్సరములో అందుచేత మరికొన్ని సంస్కరణలను చేయక ప్రభుత్వమునకు తప్పినదికాదు. శాసనసభ వేరుపద్ధతిని పునర్నిర్మాణముచేయబడినది. రెండుసభలు ఏర్పాటు అయినవి. ఒకటి కేంద్ర శాసనసభ (Legislative Assembly), రెండవది రాష్ట్రములసభ (Council of States). వీటియందు సభ్యులు చాలవరకు ఎన్నుకోబడునటులే ఏర్పాటు జరిగెను. అయితే ఎన్నిక చేయువారు అనగా వోటుగలవారు మాత్రము చాల తక్కువగనుండిరి. రాజప్రతినిధి కార్యనిర్వాహకవర్గమునకు మరికొంతమంది మన దేశీయులను నియామకము చేయుట జరిగినది. శాసనసభలకు గూడ యిదివరకుకన్న హెచ్చు అధి

కారములు ఇవ్వబడినవి. అయినను ప్రభుత్వము ప్రజలకు జవాబుదారీ ప్రభుత్వమగుటకు ఏర్పాటు కాలేదు."

"అట్లయిన కాంగ్రెసునకు అసంతృప్తి కల్గలేదా ?" అని లీల అడిగెను.

"సరి, బ్రిటిషు ప్రభుత్వమునకు సైన్యసహాయమున్నపుడు కాంగ్రెసు ఏమిచేయగలదా?" దని శేఖరు అడిగెను.

"సరిగా యీ సమయమందే మన భారతదేశ రాజకీయ రంగమందు ఒక మహావ్యక్తి ప్రవేశించెను. ఆ వ్యక్తియే మనలను ముందుకు నడిపి దేశముయొక్క సంపూర్ణ స్వాతంత్ర్యము సంపాదించిన వ్యక్తి." అని నారాయణగారు చెప్పిరి.

"ఓహో! గాంధీజీగారా నాన్నగారూ ?" అని శేఖరు, లీల ఏకకంఠముతో అడిగిరి.

"అవును. ఆ వ్యక్తి మహాత్మాగాంధీ. బ్రిటిషు ప్రభుత్వముపై నుపయోగించుటకు ఆయన మనకొక నూతనమైన, వింతైన ఆయుధమును ప్రసాదించెను."

"ఏమి ఆయుధమది ?" అని లీల అడిగెను.

"ఆటంబాంబులాంటిదా అది ?" అని శేఖరు అడిగెను.

"నారాయణగారు నవ్వుచు అది బాంబువంటిది కాదు. యీ అణుశక్తి బాంబులకన్న అంతకన్న పెద్దబాంబులకన్న హెచ్చుశక్తి కలది."

"ఏమిటి అది ?" అని ఇద్దరు ఒక్కమారుగనే అడిగిరి.

"దానిపేరు సత్యాగ్రహము. యుద్ధములలో సైనికు లుపయోగించు ఒకరి నొకరు చంపుకొను ఆయుధము కాదు. కాని సత్యము, అహింస అను ఆయుధము."

"అది యుద్ధము చేయుట కెటుల నుపయోగించును ?"

"ఎటుల ఉపయోగము చేయవలెనో గాంధీజీ చూపించెను. 1921 వ సం. బ్రిటిషు ప్రభుత్వమునకు వ్యతిరేకముగా ఈ సత్యాగ్రహ ఆయుధమును ఉపయోగించుట ఆరంభించెను. దేశమందంతటను పర్యటనము గావించి స్వతంత్ర జాతీయతా భావమును తరంగ క్రమముగ వృద్ధి చేసెను. చరిత్రయందపూర్వమైనది. ప్రభుత్వమునకు సహాయము చేయకుండా నుండవలెనను సహాయ నిరాకరణమును ఉపదేశించెను. అన్యాయమైన శాసనములను ధిక్కరించవలసినదని, అట్లు ధిక్కరించుటయందు సత్యము, అహింసను అవలంబించవలెననియు ప్రబోధము గావించెను.

"దేశమంతయు ఒక్కమారు మేల్కొనెను. ఆపిలుపు అనిరాకరణమైనది. వేలకొలది ప్రజలు ప్రాంత ప్రాంతముల నుండి వచ్చి యీ నవీనమైన పద్ధతిని యుద్ధము చేయుటకు సిద్ధపడిరి."

"ప్రభుత్వమువారు దీనికి ఏమి చేసిరి ?"

"ప్రభుత్వమువారు ఈ యుద్యమము కొద్దికాలములోనే నశించుననుకొనిరి. గాంధీజీని యింకను అనేకమందిని కారాగృహములందు బంధించిరి. అనేక ప్రాంతములలో సైన్య బలముతో, పోలీసుల సహాయముతో ప్రజలఆందోళన మణగ ద్రొక్కుటకు యత్నించిరి. ప్రజలకు దానివలన కోపము కల్గి అహింసా మార్గమును తప్పిరి. అందుచేత ఉద్యమమును కొంత కాలమువరకు గాంధీగారు ఆపివేసిరి."

"ఎందుకు ఆపవలెను?" అని శేఖరు అడిగెను.

"ప్రజలు సంపూర్ణముగ అహింసతో నడచుకొనవలెననియు ప్రభుత్వమువారు హింసామార్గ మవలంబించినను ప్రజలు ప్రతిహింస చేయకూడదనియు ఆయన మతము. ఇంతలో కొంతమంది కాంగ్రెసు నాయకులు శాసన సభలయందుండి ప్రభుత్వ వ్యతిరేక ప్రచారము సాగించి అహింసా యుద్ధమును సల్పవలెనని యూహించిరి."

"శాసనసభలయందుండి అట్టి యుద్ధముచేయుట ఎట్లు చేయగలుగుదురు?" అని లీల అడిగెను.

"ఎన్నికలలో గెల్చొంది శాసనసభలలో ప్రవేశించి ప్రభుత్వము అన్యాయమైన శాసనములను చేయకుండా అడ్డుపడిరి. ప్రజల అభిప్రాయములకు వ్యతిరేకములగు కార్యములను ఖండించి ప్రభుత్వము యొక్క నడకకు అడ్డంకులు కల్పించిరి."

"ఇట్టి కార్యము శాసనసభలకు అవతల జరుగు ఉద్యమమునకు తోడ్పడియుండవలెనుకదా?" అని శేఖరు అనెను.

"అవును. 1930 వ సంవత్సరము గాంధీజీ తిరిగి సత్యాగ్రహము ప్రారంభించెను. సంపూర్ణ స్వాతంత్ర్యము కాంగ్రెసు కార్యక్రమముయొక్క లక్ష్యమని నిశ్చయమై గాంధీజీనాయకత్వమున బ్రిటిషు పరిపాలన మంతమొందించుటకు కాంగ్రెసు నిశ్చయించెను. పన్నులు యివ్వక నిరాకరించవలెననియు అన్యాయములైన శాసనములను ఉల్లంఘించవలెననియు, విదేశవస్తువులను బహిష్కరించవలెననియు ముఖ్యముగా విదేశపు బట్టను ముట్టుకొనరాదనియు ప్రచారముచేయుచు మధుపాన నిరోధ

కముగా "పికెటింగు" (Picketing) అనగా కొనువారు కొన కుండ చేయుట, అదేవిధముగా విదేశ వస్త్రములు కొనకుండా చేయుట మొదలుగా గల కార్యక్రమము శాంతి, ప్రబోధ పద్ధతులపైని ఆరంభముచేసిరి. దేశములో గల అన్ని ప్రాంతముల నుండియు, పురుషులు, స్త్రీలు వేలకొలది తిరిగి ఆయన అసమాన నాయకత్వమున సత్యాగ్రహ సమరమును పట్టణము లంట పల్లెలలోను తీవ్రముగా జరిపిరి."

"ప్రభుత్వమువారు ఏమిచేసిరి ?"

"సత్యాగ్రహులను కారాగృహములందు పెట్టిరి. లాఠీలతో కొట్టించిరి."

"సత్యాగ్రహులు తిరుగబడలేదా ?"

"లేదు. తిరిగి ప్రతిహింస చేయకూడదని, అవసరమైన మరణించవలెననీ గాంధీగారి మంత్రాదేశము."

"అబ్బా! ఎంతబాధ పడియుండిరో ?" అని లీల సానుభూతితో అనెను.

"సత్యాగ్రహులను కొట్టి కారాగృహములందు పెట్టిన పిమ్మట ఏమాయెను?" అని శేఖరు అడిగెను.

"మరికొంతమంది సత్యాగ్రహులు వచ్చి సత్యాగ్రహము చేసిరి. వారుకూడా కారాగృహములందు పెట్టబడిన పిమ్మట యింకను కొంతమంది వచ్చుచునేయుండిరి. ఈ ప్రవాహము అంతములేనిదానివలెయుండెను. దేశములోని కారాగృహము లన్నియు సత్యాగ్రహులతో నిండిపోయెను. ఏమిచేయుటకు ప్రభుత్వమునకు తోచలేదు. హింస చేయని సైనికులతో

యుద్ధము చేయుట ఎట్లని ప్రభుత్వమువారు నిరాలోచనాపరులైరి."

"మీరుకూడ సత్యాగ్రహముచేసితిరా నాన్నగారూ?" అని శేఖరు అడిగెను.

"అవును చేసితిని."

"మిమ్ములకూడ పోలీసువారు కొట్టిరా?"

"అవును. నా తలపై బలమైన గాయముతగిలి 6 నెలల వరకు కుదరలేదు."

"మిమ్ముల గూడ ఖైదులో పెట్టిరా?"

"అవును. రెండుసంవత్సరములు ఇతరులవలనే నేనుగూడ ఇబ్బంది పడితిని."

"కారాగృహము, లాఠీదెబ్బలవలన మీమనసులో భయము కల్గలేదా?" అనిలీల అడిగెను.

"లేదు. దేశమంతటను ఒక నూతనమైన శౌర్యము, మనోనిశ్చయముకల్గి నాయకుని ఆదేశప్రకారము నడచి మరణించుటకైనను సత్యాగ్రహులు సిద్ధమైరి."

"ఎంత అద్భుతమైనది! ప్రభుత్వమువారు ఎటుల తట్టుకోగల్గిరి?" అని శేఖరు అడిగెను.

"ప్రభుత్వమువారికి ఏమియు పాలుపోలేదు. యీ యుద్ధము ఆపవలెనని గాంధీగారిని బ్రతిమలాడి ఒక ఒడంబడికకు వచ్చిరి."

"స్వరాజ్య మిచ్చుట కంగీకరించిరా?"

"అంత సులభముగా అంగీకరించలేదు. గాంధీజీ ప్రజల యొక్క కోరికలగూర్చి చెప్పుటకు లండను నగరము వెళ్ళెను. సంపూర్ణమైన బాధ్యతగల ప్రభుత్వము ప్రజలవశము చేయుటకు ఇంకను బ్రిటిషు ప్రభుత్వమువారు అంగీకరించలేదు. 1935లో ఒక క్రొత్త ప్రణాళికను నిర్మాణము చేసిరి. కాని అది ప్రజలకు అంగీకారముగాలేదు. ఆ ప్రణాళిక ప్రకారము శాసనసభలు విస్తృతమై, ఓటింగు హక్కుకూడ విస్తృతము చేయుటకు ఏర్పాటు అయినది. కాని ప్రజలవలన ఎన్నుకోబడిన ప్రతినిధులకు సంపూర్ణ హక్కులు, బాధ్యతలు అందు ఏర్పాటుకాలేదు. మన దేశము వదిలి బ్రిటిషువారు వెళ్లునటులే కన్పడలేదు. అందుచేత తిరిగి సత్యాగ్రహ సమర మారంభించుటకు గాంధిగారు నిశ్చ యించిరి. 1940 లో ఒకటి, 1942న మరియొకటి. 1942 ఉద్యమమందు సంపూర్ణస్వాతంత్ర్యము వెంటనే మన దేశమునకు ఇచ్చివేయవలసినదని ఆయన అడిగెను. దేశ మాసేతు హిమాచల పర్యంతము ఒక్కమారుగ ఏకకంఠముతో అందరును ఆయనమాటను బలపరిచిరి. ఇటుపైని తమ చేతుల యందు రాజ్యాధికార ముంచుకొనుట బహు కష్టతరమని గ్రహించి బ్రిటిషు ప్రభుత్వమువారు 15-8-47 న మన దేశమునకు సంపూర్ణస్వాతంత్ర్యమును ఇచ్చివేసిరి.

"అప్పుడా మన పార్లమెంటు ఆరంభమైనది?" అని శేఖరు అడిగెను.

"అవును. మన నాయకులు యావన్మంది ఒక క్రొత్త రాజ్యాంగ ప్రణాళికను (Constitution) నిర్మాణము చేసిరి.

సంపూర్ణస్వాతంత్ర్యము కలదై ప్రజాధికారముతో ఏర్పాటైన స్వతంత్ర ప్రజాస్వామిక రాజ్యమై (Sovereign Democratic Republic) మనదేశము అప్పుడు స్వేచ్ఛపొందినది. ఆ ప్రణాళిక యందు దేశములో వయస్సువచ్చిన వారందరుకలిసి ఎన్నుకొనిన ప్రతినిధులతో పార్లమెంటు రెండు సభలుగ లోకసభయని, రాజ్యసభయని రెండు నామములతో నిర్మాణము పొందినది. ప్రజలయొక్క సంపూర్ణ స్వాతంత్ర్యము పార్లమెంటునకు వశము చేయబడినది. ఈ పార్లమెంటునకే ప్రభుత్వము బాధ్యత పూని కార్యనిర్వహణ చేయుటకు ఏర్పాటాయెను.

ఈ కొత్త రాజ్యప్రణాళిక ననుసరించి 1952 సంవత్సరమున మొదట ఎన్నికలు జరిగి ప్రథమ స్వతంత్ర భారత పార్లమెంటు నిర్మాణమై సమావేశమయ్యెను. మన దేశముయొక్క స్వాతంత్ర్య సమరముతోనే మన పార్లమెంటుయొక్క పుట్టుక కూడ సంబంధము కల్గియున్నదని నే చెప్పినదానివలన మీరు గ్రహించియుందురు. మనకు సంపూర్ణస్వాతంత్ర్యము వచ్చినపుడే మన పార్లమెంటునకుకూడ సంపూర్ణస్వాతంత్ర్యము వచ్చెను."

"బాగున్నది. కథల పుస్తకములోగల కథలన్నింటికన్న మన పార్లమెంటుకథ వినుటకు బాగున్నది." అని శేఖరు అనెను.

ప్రకరణము 6

## పార్లమెంటు భవనము

నారాయణగారు వారి కుటుంబము ఢిల్లీవచ్చిన మరి రెండురోజులకు పార్లమెంటుసభ సమావేశములు ఆరంభ మయ్యెను. సభాసమావేశము మరునాడనగా నారాయణగారు తన భార్యాపిల్లలను పార్లమెంటు భవనము చూపించుటకు తీసికొనివెళ్ళిరి. "ఎంత మహాసౌధము!" అని శేఖరు భవన ద్వారము చేరుచున్నప్పుడు అనెను. "దూరమునుండి చూచుటకు చాలా అందముగను గొప్పగను ఉన్న"దని నారాయణగారి భార్య అనెను. "ఎంత పెద్దది! చక్కని వలయమువలెనున్నది." అని లీల యన్నది.

"ఈ వలయముయొక్క ప్రమాణము ఎంత ఉండును ?" అని నారాయణగారు అడిగిరి.

"చుట్టుకొలత ½ మైలుండునని అనుకొందును." అని శేఖరు అనెను.

"అవును. దగ్గరదగ్గర దాని చుట్టుకొలత ఒక మైలులో 3 వ వంతుండును. దీని అడ్డుకొలత 560 అడుగులు కలదు."

"మా పాఠశాల ఆటపందెములు ఇక్కడ పెట్టినయెడల ఈ భవనముచుట్టున మా పరుగెత్తు పందెములు జరుగుటకు బాగుగ నున్నది" అని శేఖరు అనెను. "చుట్టుగల ఈ పచ్చని

మైదానములు అన్ని ఆటలు ఆడుకొనుటకు బాగున్నవి" అని నారాయణగారి సతీమణి నాల్గువైపుల చూచుచు అనెను.

"ఈ స్థలముయొక్క విస్తీర్ణము రమారమి 6 ఎకరములు గలదు."

"ఈ భవనముయొక్క కొలతలు, ఆకారము ఎవరు నిశ్చయించిరి ?" అని నారాయణగారి భార్య అడిగెను.

"ఇద్దరు బ్రిటిషు వాస్తు శాస్త్రజ్ఞులు సర్ ఎడ్విన్ ల్యూట్యన్స్, సర్ హెర్బర్టు బేకరు అను పేర్లుగలవారు. న్యూఢిల్లీ నగరమంతయు వారే రూపొందించిరి. కార్య నిర్వాహక సౌధములు, రాష్ట్రపతి భవనముకూడ వారియొక్క నిర్మాణమే" అని నారాయణగారు అనిరి. "ఈ మహాభవనము వలయాకారముగా వారు రూపమిచ్చినందుకు వారికి ధన్యవాదము తీయవలసినదే" అని నారాయణగారి భార్య అనెను.

"ఎందుచేత ?" అని నారాయణగారు అడిగిరి.

"పార్లమెంటు అనునది ప్రజలయొక్క స్వాతంత్ర్యమునే కాక పరస్పరముగా వారిలో వారికిగల సామ్యమునుకూడ తెలియజేయును. అందుచేత ఈ వలయాకారము శాశ్వతము, సమానత అను భావములకు చిహ్నమైనది. ఇంతియేకాదు. మన జాతీయ జండాపైని చక్రమే జాతీయ చిహ్నముగా ఏర్పరచుకొని యున్నాము. అందుచేత మన పార్లమెంటు భవనముకూడ వలయాకారమున ఉండుట సమంజసమే యని నాకు తోచుచుండును."

"నీకు చాలా చక్కని ఆలోచనగలదు."అని నారాయణగారు భార్యతో సల్లాపముగా ననిరి.

"దీనిని ఎప్పుడు కట్టిరి?" అని ఆమె భర్త చేసిన పొగ డ్తకు కొంచెము లజ్జతో అడిగెను.

"1921వ సం. ఆరంభముచేసి 7 సం. కట్టుట పూర్తియై 18-1-1927 తేదీన యీ భవనము ప్రారంభోత్సవము జరిగినది."

"దానికి చాలా డబ్బు ఖర్చై యుండునుకదా?" అని శేఖరు అడిగెను.

"అవును. 83 లక్షల రూపాయలు ఖర్చు అయినది. ఆ కాలములో వస్తువుల ఖరీదులు తక్కువగనుండెను. ఈ రోజులలో అయిన 4 కోట్ల రూపాయలకు తక్కువ కాదు."

"ఈ భవనము పూర్తి కాకపూర్వము పార్లమెంటు సమావేశము ఏ భవనమునందు జరుగుచుండెను?"

"1911 సం. లో కలకత్తానుండి ఢిల్లీకి రాజధాని మారిన విషయము మీకు తెలియునుకదా? భవనము కట్టుట పూర్తియగువరకును ప్రభుత్వము, శాసనసభకూడ పాత ఢిల్లీలో పాత ప్రభుత్వపు భవనములందు (Old Secretariat) ఉండెను. ఆ రోజులలో శాసనసభకు పార్లమెంటు అని పేరులేదు. శాసన సభ యని అప్పటిపేరు. ఒక్కటేసభ. రాజ్యసభ అప్పుడులేదు."

"భవనములోనికి వెళ్ళుదమా?" అని శేఖరు అనెను.

అప్పుడు తూర్పున నున్న మొదటి గుమ్మ మెక్కిరి. అక్కడ ఒక గుమ్మము దగ్గర రాతిపైని చెక్కడమొకటి లీలకు కన్పించినది. ఇది ఏమియని ఆమె అడిగెను. "ఆ భాష సంస్కృతము. ప్రజలు వారి స్వతంత్ర శాసనసభ లోనికివచ్చుటకు ఈ

ద్వారము లెప్పుడు తెరువబడియుండునని ఆ చెక్కడము యొక్క యర్థము." లోపల మొదటి వసారాలో నడుచుచు నారాయణ గారి భార్య "మన దేశపుచరిత్ర, మన నాయకుల జీవితములలోని అంశములు ఈ గోడలపైన చిత్రించిన ఎంత బాగుండును?" అని అనెను.

"బాగుగ చెప్పితివి. అటువంటి చిత్రములు వేయించుటకు అప్పుడే నిశ్చయమైనది. కొద్దికాలములో ఆ కార్యమగునని అను కొనిరి." అని నారాయణగారు అనిరి.

"ఈ గదులు ఏమి గదులు ?" అని లీల అడిగెను.

"మంత్రులు, పార్లమెంటు యొక్క పెద్ద ఉద్యోగస్థులు కచేరి చేసుకొనుటకు, ఈ గదులు ఏర్పరుపబడినవి. అన్ని పార్టీల సభ్యులు ప్రత్యేకముగా కలుసుకొని తమ చర్చలు చేసుకొను టకు గూడ వేర్వేరు గదులు కలవు."

"మంత్రులకు యిక్కడ కచేరిగదులుఎందుకు ?" అని శేఖరు అడిగెను.

"పార్లమెంటు సమావేశము జరుగునప్పుడు ప్రశ్నలకు జవాబులిచ్చుట, ఉపన్యాసములనిచ్చుట, శాసనములుపక్ర మించుట ఎన్నియో కార్యములు మంత్రులు చేయవలెను. సభ యందుహో జరగుటకుతొందరతొందర అవసరములుకల్గుచుండును. ప్రభుత్వభవనమునందు (Secretariat) వారున్నయెడల త్వరగా యిక్కడకు వచ్చుటకు వీలుండదు. అందువలన వారికి యిక్కడ ప్రత్యేకముగా గదులు ఏర్పాటుచేయబడినవి." "ఎంక్వైరీ ఆఫీసు

(Enquiry Office)" అని లీల గోడమీదనున్న ఇంగ్లీషు అక్షరములను చదివినది.

"పార్లమెంటు సమావేశమగునప్పుడు సభ్యులను కలసికొనుటకును, పార్లమెంటు ఉద్యోగస్తులను కలుసుకొనుటకును అట్లు చూడదలుచుకొనిన వారికి అట్లు పోవుటకు అనుజ్ఞాపత్రము (Pass) ఇవ్వబడును."

'తపాలా తంతివార్తల ఆఫీసుగూడ నున్నదే!' అని గోడ మీద ప్రకటనలు, ఎదురుగా తపాలుపెట్టె మొదలైనవి చూచి అనెను.

"ఇక్కడ పనిచేయువారికి సభ్యులకు యివి ఉపయోగమగును. ఇండియా స్టేటుబ్యాంకు (State Bank of India యొక్క ఒక శాఖా కార్యాలయముకూడ యిక్కడ ఉన్నది. అలాగునే టెలిఫోను, రైలుటిక్కెట్లు కొనుక్కొను స్థలము, ఫలహారశాలలుకూడ ఇక్కడ కలవు."

"ఆడుకొను క్లబ్బు (club) గూడా ఒకటి యున్నయెడల మీరుచెప్పు జాబితా పూర్తియగు" నని నారాయణగారి భార్య అన్నది.

"అదికూడా కలదు. పార్లమెంటులో పనిచేయుచున్న ఉద్యోగస్తులకు ఒక క్రీడాసంఘం (Recreation club) వున్నది. ఇంటిలోపలను వెలుపలను ఆటలకుఅవకాశము కలదు. నాటకములాడుట, సాంఘికమైన సమావేశములు, యాత్రలు మొదలైనవి, ఆసంఘము ఏర్పాటుచేయును. యిప్పుడు పదండి, మధ్య సభా

మందిరము (Central Hall) నకు." లోకసభ రాజ్యసభకు నడుమగ నున్న ఖాళీస్థలముగుండా నడచివెళ్ళిరి.

"ఇక్కడ తోట చాలా రమణీయముగ నున్నది" అని లీల అనెను.

నిడుమైన నీటికుండలు నీరు పైకెగచిమ్ముచున్న నీటి కొళాయిలు ఆకుపచ్చని గడ్డిపెంచియున్న బయలు స్థలములు ఆస్థలములకు నలుప్రక్కలవున్న పూలమొక్కల కుదుళ్ళు నిజముగా అందముగనే యున్నవి.

నారాయణగారిభార్య "యిది మనోరంజకముగానున్నది. ఈచల్లదనము, ఈ మొక్కలలో పూలమొక్కలరంగులు ఆహ్లాదము కల్గించుచున్నవి" అని అనెను.

"ఇటువంటితోటలు మరిరెండు ఆప్రక్కనగలవు. ఈ రెండు పక్కలను అర్ధ వలయాకారముగనున్న సభా మందిరములు కన్పించుచున్నవి కదా ? మనకు కుడిప్రక్కన గలది లోకసభా భవనము, ఎడమప్రక్కది రాజ్యసభా భవనము. మన కెదురుగా అవతలవైపు యిట్టిదే మరియొక భవనము కలదు. అది పూర్వము స్వదేశ సంస్థానాధీశుల సభామందిరము. ఇప్పుడందు పరమోన్నత న్యాయస్థానము (Supreme Court) వున్నది. ఈ భవనముల మధ్య ఈ బయలుస్థలములు, తోటలు గలవు."

"సాయం సమయమున స్నేహితులయొక్క సల్లాప సమావేశములకు సాంఘికమైన ఉత్సవములకు యీ స్థలములు మిక్కిలి తగియున్నవి." అని నారాయణగారి భార్య అనెను.

"అవును, అసలు వాని వాడుక అందులకే."

మధ్య భవనము ప్రవేశించగా ఒక ప్రత్యేక వసారా (Lobby) ను దాటి మధ్యను గోపురముక్రిందకు వచ్చిరి.

"ఈ భవనము చాలా గొప్పగా నున్నది" అని నారాయణ గారి భార్య అన్నది.

"ఇదియును వలయాకారముగనే యున్నదే ! వలయములో వలయము" అని శేఖరు అనెను.

మీదకు చూచుచు, లీల "ఎంత పెద్దగోపురము!" అని అనెను.

"ఈ గోపురము ఎత్తు 70 అడుగులు. ఒకవైపునుంచి రెండవ వైపునకు 100 అడుగులువున్న"దని నారాయణగారు అనిరి.

"మనము మాటలాడునది ప్రతిధ్వనించుటలేదే ?" అని నారాయణగారి సతి అన్నది.

"ప్రత్యేకముగా శబ్దగ్రహణము చేయు ఇటుకలను మీదను వేయుటవలన మన మాటలయొక్క ధ్వని ఆ యిటుకలవరకు పోయినధ్వని తిరిగి వెనుకకురాదు అని నారాయణగారు చెప్పిరి."

మీద గోపురమువైపుచూచుచు "ఈ మధ్య పెద్ద దీపముల గుత్తి యుండిన ఎంతబాగుండును? అందము ఎంతో హెచ్చగును" అని లీల అనెను.

శేఖరు ఒకే నల్లచలువరాయి స్తంభమును చూచి "ఎంత లావణ్యముగ నున్నది!" అని దానిదగ్గరకు పోయెను. "ఎంత నునుపు ! ఎంత మెరుపు !" అని లీల అనెను.

నారాయణగారు "ఈ స్తంభములకు చలువరాయి గయ నుండి వచ్చెను. ఇటువంటి స్తంభములు ఈ భవనములో ఇరువది రెండున్నవి. ప్రతి నాల్గుస్తంభముల పైనను ప్రేక్షకులు కూర్చొను స్థలము (Gallery) కట్టబడి యున్నది. అధ్యక్షుని వేదికపైన గూడ ఒక ప్రేక్షకస్థలము కలదు."

"ఎందుకీప్రేక్షకస్థలము" అని లీల ఆరు ప్రేక్షకస్థలముల వైపు తలనుత్రిప్పి చూచుచు అడిగెను.

నారాయణగారు "ప్రేక్షకులు వచ్చి పార్లమెంటు సభా చర్చలు చూచుటకు వినుటకు ఏర్పరుపబడినవి" అని అనెను.

వేదికకు చుట్టుగల చలువరాతి జాగు పనివానితనము మెచ్చుకొని యిది చాలా మంచి పనివానితనమని నారాయణ సతి అనెను.

"ఈ చలువరాయి ఎక్కడనుండి వచ్చినది?" అని శేఖరు అడిగెను.

"బెలూచిస్థాన్‌లో గల యార్ఖానానుండి. 1947 కు పూర్వము బెలూచిస్థాన్ మన దేశములో ఒక భాగముగానే యుండెడిది."

"దక్షిణ భారతదేశమునుండి యీ భవనము కట్టుటకు ఏమైనను వస్తువులు వచ్చినవా ?"

"రాకేమి? వచ్చినవి. నల్లకర్రఅంతయు అక్కడనుండియే వచ్చెను. తలుపులకు, తలుపు చెక్కలకు అదియే వాడిరి. టేకు కర్ర అస్సామునుండి వచ్చెను. ఎరుపు తెలుపు రంగుగల ఆ మెత్తనిరాయి (Sand stone) యీ పరిసర ప్రాంతములలోనిదే.

భారతదేశముయొక్క నాల్గుదిక్కులనుండి కూడ యీ భవనము యొక్క అందము ప్రతిభ హెచ్చుచేయగల వస్తుసామగ్రి యిందు కలదు."

"మహాత్మాగాంధీజీ యొక్క బొమ్మ యిదిగో" అని వేదికపైని అధ్యక్షుని కుర్చీకి వెనుకనున్న బొమ్మను చూచి అనెను.

మునుపు (Constituent Assembly) రాజ్యప్రణాళికా నిర్మాణ సంఘములో సభ్యులైన ఎ.పి. పట్టాణిగారు తన తండ్రి ఆజ్ఞప్రకారము లండనులో ఆయన కొనినట్టి యీ చిత్రము బహుమతిగానిచ్చిరి. ఇది సర్ ఆస్వాల్ బిర్లే అను సుప్రసిద్ధ బ్రిటిషు చిత్రకారుడు చిత్రించిన పటము."

"ఎడమవైపు చూపించుచు ఈ బొమ్మ ఎవరిది?" అని శేఖరు అడిగెను.

"అది మరియొక సుప్రసిద్ధ దేశాభిమానియైన దాదా భాయినౌరోజీయొక్కచిత్రపటము. ఈ సభాభవనము నందుంచుటకు బొంబాయినగర పార్శీపౌరులు బహుమతిగా నిచ్చిరి."

అక్కడనున్న లోకమాన్యతిలకు మహాశయుని చిత్రపటమును లీల తదేకధ్యానముతో చూచుచు "నాయనగారూ! ఈ పట మెవ్వరిది? ఈయన రూపరేఖావిలాసములు చాలా గంభీరములై కార్యశూరుడని గొప్పవాడని చెప్పక చెప్పుచున్నవే!" అనెను. అంతట నారాయణగారు "నిజమే ఆయన మహారాష్ట్రకేసరి యగు లోకమాన్యతిలకు. మన రాజకీయములకాయన ఒక నూతనరూపము నిచ్చెను. స్వరాజ్యము నా జన్మహక్కు నేను పొందితీరుదునని మొదటచెప్పినవారాయనయే!"

"ఇక్కడ మన దేశనాయకుల ఇతరచిత్రములుగూడా ఉన్నచో చాల రమణీయముగానుండును" అని నారాయణగారి సతి అనెను.

"అవును. అదియు జరుగగలదు. ఈ భవనములో చుట్టును పంద్రెండు చిత్రపటము లుంచుటకు ఖాళీ స్థలములను ఏర్పాటు చేసియుంచినారు. చిత్రపటములు లభించునపుడు వానినికూడా ఇక్కడ ఉంచెదరు."

"చుట్టును పుస్తకముల బీరువాలు ఎందుకున్నవి?" అని శేఖరు అడిగెను.

"ఈ భవనము సభ్యులయొక్క పుస్తక భాండాగారముగా మొదట నిర్మాణమైనది. 1946 సం.లో రాజ్యాంగనిర్మాణసభ (Constituent Assembly) ఏర్పాటు అయినపుడు ఈ భవనమును సభామందిరముగా మార్చిరి. అప్పుడు ఇక్కడ క్రిందను ప్రేక్షక స్థలములలోను కుర్చీలు బల్లలు ఏర్పాటుచేయబడినవి. ఈ ప్రదేశముననే స్వతంత్ర భారత దేశము యొక్క ప్రజాస్వామిక రాజ్యాంగము జన్మించినది. ఈ భవనమందే 1947 సం. ఆగస్టు 14 అర్ధరాత్రి 15వ తేదీ ప్రారంభమగు సమయమున మన భారత దేశము స్వతంత్ర దేశమని లోకమున ఉద్ఘోషణము చేయ బడినది."

"చాలా చారిత్రక ప్రాముఖ్యము పొందిన స్థలమందు మనము నిలుచుండియున్నామిప్పుడు. ఇది చూచుటవలన ఎంతో సంతోషముగా నున్న"దని నారాయణగారి సతి అన్నది.

"పార్లమెంటు సభా సమావేశము ఈ భవనములోనే జరుగునా?" అని శేఖరు అడిగెను.

"జరుగదు. రెండు సభలును వేర్వేరు భవనములలో సమావేశమగును. కాని ఎప్పుడైనను ఏకసభగా నవి సమావేశము కావలసినపుడును ముఖ్యమైన జాతీయ, అంతర్జాతీయ సమావేశములు జరుపవలసినపుడును ఈ భవనములో జరుగును. అందుచేతనే రాజ్యప్రణాళికాసభ ముగిసినను సభ్యులు కూర్చుండు ఏర్పాట్లు అప్పటివలెనే యున్నవి."

"వసారాలోనున్న ఈ గదులెందుకు?" అని నారాయణగారిసతి అన్నది.

"సావకాశముగా కూర్చొనుటకును ఏదైన చదువుకొనుటకు, వ్రాసుకొనుటకును ఈగదులు ఉపయోగపడును. అందులో ఒకగది ప్రత్యేకముగ స్త్రీలకు కేటాయించబడినది.' పుస్తకములుగూడ కొన్ని యీవసారాగదిలో ఉన్నవి. తొందర తొందరగా సభ్యులకు అవసరమైనపుడు ఇచ్చుటకు పెద్ద పుస్తక భాండాగారమునుండి కొన్ని పుస్తకాలుతెచ్చి ఇచ్చట ఉంచబడినవి. దిన, వార, మాస సాంవత్సరికపత్రికలు వచ్చినవన్నియును సభ్యుల యుపయోగముకొరకు ఆపెద్ద బల్లమీద పేర్చబడి యుండును."

ఆ మధ్యభవనమునుండి వచ్చు సరికి ఒంటిగంట అయినది. మొదటి మేడఎక్కి ఫలహారములు ఇచ్చు గదిలోనికి వెళ్ళిరి. అక్కడ మధ్యాహ్న భోజనము చేసికొని మిగిలిన భవనమంతయు చూచుటకు నడచిరి. అక్కడ వసారాకుగల పెద్దవి, ఎత్తైనవిఅగు స్తంభములను చూచి "అబ్బో! ఈ స్తంభములు ఎంత పెద్దవి! దూరమునుండి యింతపెద్దవి అని తెలియలేదు."

ప్రతి స్తంభము 27' ఎత్తు. ఇటువంటివి 144 స్తంభములు భవనము చుట్టును కలవు. దూరమునుండి చూచుటకు మంచి దృశ్యము. మరియొక గదిలోనికి ప్రవేశించిరి. ఇది అసలు పుస్తక భాండాగారము. అద్దముల తలుపులతో అనేకములైన బీరువాలలో వేలకొలది పుస్తకములు కలవు.

"ఎంత నిశ్శబ్దముగా నున్నది. సభ్యులు ఇక్కడ కూర్చొని శాంతి వాతావరణమునందు చదువుకొనుటకు ఏర్పాటుచేయబడినది కనుక నిశ్శబ్దముగా నుండును."

"ఇక్కడ కూర్చొని మాపరీక్షకు చదువుకొనుటకు చాలా బాగా నుండును!" "అయినట్లయిన ఇంటిదగ్గర నీపాఠములను చదువవు కాబోలు" అని శేఖరుని అనెను. "ఇంత నిశ్శబ్దమైన గదియున్న బాగుండునని అనుచున్నాడు కాని యింటి దగ్గర చదువ నని అనుటలే"దని లీల సర్దుబాటు చేసెను. శేఖరుకు ఈమాటలు నచ్చలేదు.

"ఆమాటలకు నీవు ఏమియును అనుకొన నక్కరలేదు. పార్లమెంటులో గూడా సభ్యులు నిద్రపోవుచుందురు."

"తరువాత 53, 62, 63 నెంబరు గదిలోనికి వెళ్ళిరి. 63 నెం. గదిలో నున్నప్పుడు, అది శాసనసభాధ్యక్షుల సమావేశములకు, పార్టీ సభలకు, ప్రధానమంత్రి పత్రికా విలేఖరులను కలియుటకు ఉపయోగమగును.

1942 సంవత్సరము క్రిప్సు అను బ్రిటిషు మంత్రి మన దేశమునకు రాయబారమునకు వచ్చినపుడు ఈగదిలోనే సమావేశము జరిగెను.

"దీనికి ఉపసంఘముల (Committee) గదులు అని పేరు ఎందుకు వచ్చెను ?" అని శేఖరు అడిగెను.

"పార్లమెంటునకు ఈరోజులలో పని చాలా హెచ్చైనది. అందువలన అందరు సభ్యులతో గూడిన సభలో అంతపనియు అన్ని వివరములను ఆలోచించి చేయుటకు అవకాశముండదు. అందుచేత కొద్ది సంఖ్యగల ఉపసంఘములను ఏర్పాటుచేతురు. ఆ ఉపసంఘములు వివరముగా విషయములను చర్చించుకొని పార్లమెంటునకు నివేదన చేతురు. అట్టి సభలయొక్క సమావేశములు ఈ గదులలోనే జరుగును."

"ఈ గదు లేమి ?" అని లీల 2, 3 అంతస్తులలోనికి వెళ్ళినపుడు చూచి అడిగెను.

"ఇవన్నియు పార్లమెంటు ఉద్యోగస్థుల కచ్చేరి గదులు. ఉద్యోగస్థులు, గుమాస్తాలు, బంట్రోతులు అనేకమంది పని చేయుదురు. అంతమంది పనిచేసినగాని పార్లమెంటు పని నిరాటంకముగా చక్కగా జరుగదు. ఇప్పుడు మనకు ఇంటికి వెళ్ళుటకు వేళ అయినది. ఇంటికి వెళ్ళుటకు పూర్వము రేపటి సమావేశమునకు ప్రేక్షకపత్రములను పుచ్చుకొందును."

ప్రకరణము 7

## పార్లమెంటు సభాప్రారంభము

ఆరోజు పార్లమెంటులో బడ్జట్ సమావేశ ప్రారంభ దినము. నారాయణగారు మధ్యాభవనమందే ఈరోజున సభ ఒంటి గంటకు ఆరంభమగునని పార్లమెంటు రెండుసభలు ఏకస్థలము నందే సమావేశమగునని, రాష్ట్రపతి ఉపన్యాసముతో కార్యక్రమ మారంభమగునని చెప్పెను. అందుచేత 12 గంటలకు తమ యింటివద్దనుండి బయలుదేరిరి. పార్లమెంటుభవనమునకువచ్చుసరికి భవనముయొక్క ప్రవేశద్వారము లన్నిటిదగ్గర పోలీసు సిబ్బంది యుండెను. వారికి ప్రేక్షకపత్రములు చూపించి లోనికివెళ్ళిరి.

"ఇక్కడ పోలీసువారేల ?" అని శేఖరు అడిగెను.

"పార్లమెంటు సమావేశమగుచున్నప్పుడు భవనము యొక్క భద్రత కాపాడుటకై యిట్టి పోలీసు కాపలా యుండును. అనుమతి పొందనివారు లోనికి పోకుండగా వీరు చూతురు. పార్లమెంటు కార్యదర్శి సంతకముతో అనుమతిపత్రము లేకుండిన ఎవరును లోనికిపోవుటకు వీలులే"దని నారాయణ అనెను.

"వెలుపల రోడ్డుపైనిగూడ పోలీసువారు కలరేల ?" అని లీల అడిగెను.

"రాష్ట్రపతి తన భవనమునుండి యిచ్చటకు రాజచిహ్నము లతో పార్లమెంటు సభారంభముచేయుటకు వచ్చును కనుక

వారిత్రోవను సరిగానుంచుటకు ఈ రోజున గల" రని నారాయణ జవాబిచ్చెను.

ఎంక్వైరీ కచ్చేరిదగ్గర మేడపైకివెళ్ళుటకు మెట్లుగలవు. అక్కడ చాలామంది మనుష్యులు నిలబడియుండిరి.

శేఖరు "ఈమనుష్యులు ఎక్కడకు వెళ్ళుచున్నారు ?" అని అడిగెను.

"మనవలెనే వారుకూడా ప్రేక్షకులు. వీరందరు ప్రేక్షక స్థలములలో కూర్చొనుటకు వెళ్ళుచున్నారు. మిమ్ములను అక్కడకు తీసికొనివెళ్ళి కూర్చుండబెట్టి సభామందిరములో నా స్థలమునకు వెళ్ళెదను" అని నారాయణ అనెను.

నారాయణగారి సతి, పిల్లలు తమ ప్రేక్షకస్థలములలో తమస్థానములలో కూర్చుండిరి. అప్పటికే ప్రేక్షకజనము క్రిక్కిరిసి యుండెను. నారాయణ సభామందిరమునకు వెళ్ళి అటునిటు గుంపులుగుంపులుగా నిలిచియుండి ఒకరినొకరు పల్కరించుకొను చున్న యితర సభ్యులను కలుసుకొని తనచోటులో తాను కూర్చుండెను.

1½ గంట లగుసరికి సభామందిరమందు ప్రేక్షకస్థలము లందుగూడ సంపూర్ణమైన నిశ్శబ్దము పర్పడెను.

అంతలో సభావేదికదగ్గర ఒక ఉద్యోగి పార్లమెంటు "సభ్యులారా : రాష్ట్రపతి !" అని బిగ్గరగా అనెను. సభలోగల యావన్మందియు, ప్రేక్షకులు ఒక్కమారుగా లేచి నిలు చుండిరి. 5 వ ద్వారముగుండా సభామందిరమునకు వసారాను దాటి మెల్లగా రాష్ట్రపతి వేదికదగ్గరకు వచ్చెను. ఆయనకు

ముందు రెండుసభల కార్యదర్శులు నడుచుచుండిరి. వారివెంట లోకసభ అధ్యక్షుడు, రాజ్యసభ అధ్యక్షుడు నడుచుచుండిరి. వారివెనుక రాష్ట్రపతియొక్క సైనిక కార్యదర్శి, ఆవెనుక రాష్ట్రపతి, ఆయన వెనుక రాష్ట్రపతి రక్షక ఉద్యోగులు నడిచి వేదికదగ్గరకు చేరగా కార్యదర్శులు, రక్షకులు, రక్షకోద్యోగులు ప్రక్కకు తప్పుకొనిరి. రాష్ట్రపతి, లోకసభ రాజ్యసభ అధ్యక్షులు వేదికపైకి ఎక్కిరి. ఇంతపర్యంతము సభ్యులు ఎల్లరును ప్రేక్షకులును తమ స్థలములయందు నిలిచియే యుండిరి. రాష్ట్రపతి ఆసీనులైన పిమ్మట అందరును కూర్చుండిరి. సభా కార్యదర్శులు, రాష్ట్రపతి రక్షకోద్యోగులు వేదికపై తమకు ఏర్పాటైనకుర్చీలలో కూర్చుండిరి.

రెండు క్షణముల తర్వాత రాజ్యసభాధ్యక్షుడు, లేచి పార్లమెంటు యొక్క ప్రారంభోపన్యాసము చేయవలసినదని రాష్ట్రపతిని ప్రార్థించెను.

రాష్ట్రపతి నిలబడి హిందీలో వ్రాసియున్న తన ఉపన్యాసమును చదివెను.

తల్లి చెవిలో లీల "ఈయనేనా రాష్ట్రపతి డాక్టరు రాజేంద్రప్రసాద్?" అని అడిగెను. ఆమెకూడ లీల చెవిలో మెల్లగా "అవును. మన దేశమునకు ప్రథమ రాష్ట్రపతి యీయనే" అని చెప్పెను.

"ఆయనకు ఇరువైపుల నున్నవారెవరు ?" అని శేఖరు అడిగెను.

"తెలియదా ! ఆయనకు ఎడమప్రక్క నున్నది లోకసభ అధ్యక్షులు, కుడిప్రక్క నున్నవారు రాజ్యసభ అధ్యక్షులు. ఆయనే మన భారతదేశమునకు ఉపాధ్యక్షుడుకూడ" "ఆ వేదిక దిగువనున్న వారెవరు ?" అని తిరిగి శేఖరు అడిగెను.

"ఒకరు లోకసభ కార్యదర్శి; రెండవవారు రాజ్యసభ కార్యదర్శి. సైనిక దుస్తులలో నున్న అతను రాష్ట్రపతియొక్క సైనిక రక్షకుడు. రాష్ట్రపతి బహిరంగ కార్యక్రమములలో రాష్ట్రపతి సమీపమున ఉండుట అతనియొక్క పని."

"రాష్ట్రపతిగారు ఏమనుచున్నారు ?"

"పార్లమెంటు యొక్క ప్రథమ సమావేశము రాష్ట్రపతి గారి ఉపన్యాసముతో ప్రారంభమగును, ప్రభుత్వము అప్పటి వరకుచేసిన కార్యక్రమ సారాంశము ఆ ఉపన్యాసమందుండును. అంతియేకాక ఎట్టి కార్యక్రమము ఇకముందు ప్రభుత్వము వారు అవలంబింతురో ఏ యే శాసనములు ఆ సమావేశమునందు చేయదలచిరో ఆ విషయముకూడ రాష్ట్రపతి ఉపన్యాసమున ఉండును."

"సరియేకాని ఆయన హిందీలో మాట్లాడుచున్నారేల? మన దక్షిణమునుండి వచ్చిన దేశస్థులకు ముఖ్యముగా వారు మాట్లాడునది అర్థముకాదుగదా ?"

"నిజమేకాని హిందీ మన జాతీయభాష. స్వాతంత్ర్యము రాకపూర్వము అధికార అవసరములయందు ఆంగ్లభాషను వాడుచుండెడివారు. స్వాతంత్ర్యము వచ్చిన పిమ్మట మన స్వంతభాష మనకు ఉండవలయునుగదా ? దేశమునందు బహు

సంఖ్యాకులు హిందీభాష మాట్లాడుదురు. ఇంకను హెచ్చు మందికి హిందీ అర్థమగును. అందుచేత అఖిలభారతదేశమునకు హిందీయే అధికారభాషగానుండుటకునిశ్చయించుకొన్నాము." అని నారాయణసతి చెప్పెను.

"కాని దేశములోని వారందరును ఈ భాషను మాట్లాడరు, అర్థము చేసుకొనలేరుకదా."

"అటువంటివారు ఇప్పటినుండియు హిందీ నేర్చుకొనవలయును. అటువంటివారికి ఇబ్బందికల్గకుండ మరి 15 సంవత్సరములవరకు ఆంగ్లములో వ్యవహారములు నడుపవచ్చుననియు అటుపైనిమాత్రమే హిందీభాషలో కార్యక్రమము జరుగవలెననియు ఏర్పాటు అయినది" అని నారాయణసతి అనెను.

"మేము బడియందు హిందీ నేర్చుకొనుచున్నాముగదా!" అని లీల అనెను.

ఇంతలో రాష్ట్రపతియొక్క ఉపన్యాసము ముగిసెను. ఆయన పునరాసీనుడయ్యెను. లోకసభాధ్యక్షుడునిలిచి ఉపన్యాసమిచ్చినందులకు రాష్ట్రపతికి తన కృతజ్ఞతను తెల్పెను. ఆపైని రాష్ట్రపతి వేదికదిగి సభామందిరమునుండి తన ఉద్యోగిబృందముతో వెడలెను. రాష్ట్రపతి దిగి సభామందిరమునుండి వెడలువరకును సభ్యులెల్లరును నిలిచియే యుండిరి.

ఈ పైనజెప్పిన కార్యక్రమమంతయు ఒకగంట జరిగెను. ఆయన వెడలిపోయిన వెంటనే సభ్యులయొక్క పరస్పర సంభాషణ శబ్దము, ఒక్కమారుగా భవనమున నిండెను. తర్వాత మెల్ల మెల్లగా సభ్యులు, ప్రేక్షకులు సభాభవనమును విడిచి వెళ్ళిరి.

"ఇప్పుడు మనము తిరిగి యింటికి వెళ్ళెద" మని నారాయణ సతి అనెను.

"మీతండ్రిగారు లోకసభ సమావేశములోనుండి పాల్గొనెదరు. మరియొకదినమున లోకసభకు, రాజ్యసభకు వెళ్ళవచ్చును."

ప్రకరణము 8

# పార్లమెంటు కార్యక్రమము-I

మరునాడు శ్రీ నారాయణగారు తన కుటుంబమును లోకసభాభవనమునకు తీసుకొనివెళ్ళిరి. ప్రేక్షకస్థలమునకు వెళ్ళుటకు పూర్వము లోకసభమందిరమునకు చుట్టునుగల వసారా (Lobby)ను వారికి చూపించిరి. వసారాలోపల కొంత మంది సభ్యులు కూర్చొని ఆరోజు సమావేశములో రానున్న అంశములు ముఖ్యమైనవి ఏవియో ఒకరితో నొకరు చెప్పు కొనుచు కూర్చుండిరి.

నారాయణగారు "దానికి సభ్యుల వసారా (Members Lobby) అనిపేరు. సావకాశముగా సభ్యులు ఇచ్చట కూర్చుండి తమ సమస్యలను తమలో తాము చర్చచేసుకొనుటకు ఉపయోగ మగును" అని అనెను.

పిమ్మట మొదటి అంతస్థునకు వారిని తీసుకొని వెళ్ళి అచ్చటనున్న గదులు మొదలగు వానిని చూపించిరి. మధ్య సభాభవనమువలె కాక లోకసభామందిరము అర్ధచంద్రాకార ముగ నున్నది. గోపురముకూడ లేదు. పైకప్పు అంత ఎత్తయి నది కాదు. ప్రేక్షకులకు మొదటి అంతస్తున సభాభవనము చుట్టును ఏర్పరుపబడి యున్నది. సభాభవనమందు సభ్యులు కూర్చుండు సోఫాలు అర్ధచంద్రాకారముగనే అమర్చబడి

యున్నవి. సభ్యులందరకును ఎదురుగా వేదికకలదు. ఆ వేదిక పైని లోకసభాధ్యక్షుని కుర్చీ కలదు. ఆ కుర్చీకి సింహముఃలతో కూడిన రాజచిహ్నము కలదు.

"అది లోకసభాధ్యక్షుడు కూరుచుండు కుర్చీ" అని నారాయణగారు చెప్పిరి.

"ఆ కుర్చీకిసరిగా దిగువన కుర్చీకలదు. అందులో ఎవరు కూర్చుందురు?" "అందులో లోకసభ కార్యదర్శి కూర్చుండును. సభాసమావేశములకు కావలసిన అన్నిఏర్పాట్లుచేయుట, సభలో జరిగిన చర్చలు ప్రకటించుట మొదలుగాగల కార్యక్రమములను ఆయనే చేయును."

"ఆ పెద్ద మేజాబల్ల ఎందు కున్నది?" అని లీల కార్యదర్శి యొక్క కుర్చీకి ఎదురుగనున్న మేజాబల్లను చూపించి అడిగెను.

"ఆ బల్లను టేబుల్ ఆఫ్ ది హౌస్" (అనగాఁ సభవారి మేజాబల్ల,) అని ఆంగ్ల భాషలో అందురు.

పార్లమెంటు సమక్షమున ప్రభుత్వమువారు దాఖలు చేయుకాగితము లన్నియు సభ్యులయొక్క ఉపయోగార్థము ఆ మేజాబల్లపైన నుంచుదురు."

"ఆ ఆవరణలు ఏమి ?" అని నారాయణసతి సభాధ్యక్షుని కుర్చీ కిరువైపులనున్న కుర్చీలు వేసియున్న ఆవరణలను చూపించి యడిగెను.

"కుర్చీకి కుడివైపునున్న ఆవరణ ఉద్యోగస్థులు పార్లమెంటు జరుగుచున్నప్పుడు కూర్చుండి సభ్యులుచేయు చర్చలను వినుట కుపయోగపడును. ఆ సమయమందు అవసరమైన భోగట్టాను

వెంటవెంటనే మంత్రులకు చర్చలమధ్య అవసరమైనచో ఇచ్చుటకుకూడ వారు ఉపయోగపడుదురు."

ఎడమప్రక్కనున్న ఆవరణ రాష్ట్రపతియొక్క అతిథులును కుటుంబమువారును, సభాధ్యక్షుని అనుమతిపైని వచ్చు గొప్ప ప్రేక్షకులును అందు కూర్చుందురు.

"బాగుగా ఎడమ ప్రక్కనున్న ఆ గాజుతలుపులుగల గది ఏమిటి?" అని శేఖరు అడిగెను.

"అది సౌండ్ కంట్రోలు గది."

"అనగా శబ్దనియంత్రణాగారము. పార్లమెంటుసభలో చర్చ జరుగునప్పుడు ఒక ఉద్యోగి ఆ గదియందు కూర్చుండి సభ్యుల కంఠములను తగిన పద్ధతిని ఆ యంత్రముతో సర్దుచుండును. సభ మధ్య పొడుగుగానున్న ఆ వస్తువులు చాలా బలమైన శబ్దగ్రహణయంత్రములు. 12 అడుగుల దూరమునుండి మాట్లాడినను ఆ యంత్రములు ఆ మాటలను గ్రహించగలవు. ఇది కాక ప్రతిసభ్యుని స్థలము వెనుకను పై కగపడకుండగ ఒక శబ్దప్రసార యంత్రము (loud speaker) ఉన్నది. సభ్యుడు మాట్లాడునప్పుడు అతని మాటయొక్క శబ్దమును శబ్దయంత్రపు గదిలోనున్న యుద్యోగిసహజముగాను మార్దవముగాను ఉండునటులు యంత్రమున సర్దును."

"ఈ పద్ధతి మిగుల బాగున్నది. ప్రేక్షకస్థలముల (దర్శక వీథి) నుండి ఉపన్యాసములను చక్కగ వినగలరా?"

"చక్కగ వినగలరు. అక్కడకూడా శబ్ద ప్రసారయంత్రములు అమర్చబడి యున్నవి."

"ఆ చిత్రము ఎవరిది ?" అని సామాన్య ప్రేక్షకస్థలము క్రిందుగాను లోకసభాధ్యక్షుని కుర్చీకి ఎదురుగను ఉన్న చిత్రము వైపు చూపించి అడిగెను. అది శ్రీ విఠలబాయి పటేలుగారి యొక్క చిత్రము. పార్లమెంటుకు పూర్వమున్న శాసనసభ (సంసద్)కు ఆయన ప్రథమ అధ్యక్షుడు."

అధ్యక్షుని కుర్చీకి పైగా విద్యుద్దీపము వలన బాగుగా కన్పించుచున్న వ్రాతను చూపించి "ఆ వ్రాతలో ఏమి వ్రాసియున్నదని ?" లీల అడిగెను.

అది "ధర్మచక్ర ప్రవర్తనాయ" అని వ్రాసియున్నది. అనగా "ధర్మచక్రము నడుచుగాక" యని దాని యర్థము.

"ఇచ్చట దాని నెందుల కుంచిరి ?"

"ఈ సభ దేశమంతకు అవసరమైన శాసనములను చేయునని నీకు తెలియును. ధర్మమును అనుసరించి యీ శాసనములు ఉండవలెను. ఆ విషయము శాసనములు చేయు సభ్యుల విధిని సూచించి జ్ఞప్తిచేయుటకు ఆ విధముగ అక్కడ వ్రాయబడి యున్నది."

"ఇప్పుడు నేను సభలోనికి వెళ్ళుటకు వేళ అయినది. మీరిక్కడనే కూర్చుండి జరుగు కార్యక్రమమును చూచుచుండవలెను." అని నారాయణగారు మేడదిగి సభలోనికి వెళ్ళెను. ఇప్పటికి సభ్యులు చాలామంది ఒకరితర్వాత నొకరు వచ్చి ఆసీనులై యున్నారు. కార్యదర్శికూడ తన కుర్చీయందుండెను. పార్లమెంటుకు సంబంధించిన ఇతర ఉద్యోగులుకూడ తమ స్థలములందు కూర్చొని యుండిరి.

సరిగా వేళ యగుసరికి వేదికపైన అధ్యక్షుని కుర్చీ వెనుకనుండి "మార్షల్" అను ఉద్యోగి వచ్చి "మహాశయులారా! అధ్యక్షులు!" అనగానే సభయందున్న ప్రతివారును లేచి నిలిచిరి. అధ్యక్షులు మూడుపర్యాయములు సభకు వందనపూర్వకముగా వంగి పిమ్మట తన కుర్చీయందు కూర్చుండిరి. సభ్యులును ప్రతి వందన పూర్వకముగా వంగి అటుపైన తమతమ స్థలములం దాసీనులైరి. అంతలో కార్యదర్శిలేచి ఒక సభ్యుని పేరు పైకి చదివెను. అప్పుడాసభ్యుడు కార్యదర్శిదగ్గరకు వచ్చి అధ్యక్షునికి కుడిప్రక్కగనున్న బల్లదగ్గర నిలిచి ప్రమాణపత్రిక నకలు నొక దానిని అందుకొని యీ విధముగ చదివెను.

"నందలాలు అను నేను లోకసభకు సభ్యుడుగా ఎన్నుకొన బడి న్యాయప్రకారమున స్థాపింపబడిన ఇండియా రాజ్యాంగము (Constitution of India) పట్ల నేను భక్తి, విశ్వాసములను కలిగియుండెదననియు, నా విధులను యథావిధిగా నిర్వర్తించెద ననియు దైవసాక్షిగా ప్రమాణము చేయుచున్నాను." అతడిట్లు చదువుచుండగా "ఏమి జరుగుచున్నది?" అని మెల్లగ శేఖరు తల్లిని అడిగెను.

నారాయణ సతి "ఈ సభ్యుడు పార్లమెంటుకు నూతన ముగ ఎన్నుకొనబడినాడు. ఈ సభయందు కూర్చుండు ప్రతి వ్యక్తియు ముందుగా అట్టి ప్రమాణము తీసుకొనవలయును. ఆ పిమ్మటనే అతనికి సంపూర్ణ సభ్యత కల్గును."

ఇంతలో ఆ సభ్యుడు తన ప్రమాణమును చదువుట ముగించెను. అచ్చటనుండి అధ్యక్షుని దగ్గరకు వెళ్లెను. అధ్యక్షులు

ధన్యవాదపూర్వకముగా సభ్యుని చేతికి తనచేయి కలిపి ధన్యవాదములు చెప్పిరి. ఆ పిమ్మట సభ్యుడు అధ్యక్షుని కుర్చీవెనుక వైపునుండి కార్యదర్శి బల్ల ఇవతలవైపునకు వచ్చి నామావళి పుస్తకమునందు తన పేరును స్వయముగా వ్రాసి సంతకముచేసి ఆ పిమ్మట తనయొక్క స్థలమునకు వెళ్ళి కూర్చొనెను. మరికొంత మంది సభ్యులు ఆవిధముగానే ప్రమాణము స్వీకరించిరి. పిమ్మట మంత్రులను సభ్యులు ప్రశ్నలువేయు కార్యక్రమము ఆరంభ మయ్యెను.

ప్రథమమున అధ్యక్షులు ఒక సభ్యుని పేరు పిలిచిరి. ఆ సభ్యుడు తన చోటునందే నిలిచి ఒకటవ సంఖ్యగల ప్రశ్న అని చెప్పెను. ఆయనకెదురుగా మరొక సభ్యులు నిలిచియుండి ఏదో వ్రాసియున్నదానిని ప్రత్యుత్తరముగా చదివిరి. ఆ పిమ్మట మరియొక సభ్యునిపేరు అధ్యక్షులు పిలిచెను. అదేవిధముగా అతను ఇన్నవసంఖ్యగల ప్రశ్నయని యనెను. ఈవిధముగా 3,4 సభ్యుల ప్రశ్నలు అడుగబడినవి. ప్రత్యుత్తరములు చెప్ప బడినవి. నారాయణగారి పిల్లలకు ఇది యేమియును అర్థము కాలేదు. నారాయణ సతి అందువలన ఈవిషయమును బోధ పరిచెను.

"ఇది పార్లమెంటునందు ప్రశ్నల కాలము. ఇతర కార్య క్రమము ఆరంభము కాకపూర్వము ప్రతిదినము ప్రశ్నోత్తరము లకు ఒక గంట వ్యవధి నిచ్చెదరు. లేచి నిలిచి ప్రశ్నసంఖ్య చెప్పిన యతడొక సభ్యుడు. ప్రత్యుత్తరమిచ్చుచున్న యతడొక మంత్రి."

"ప్రశ్న యొక్క సంఖ్య యే సభ్యుడైన చదువుచున్నపుడు మంత్రికి ఆ ప్రశ్న యేదో యెటుల తెలియును?" అని లీల అడిగినది.

"దినదినము అడుగు ప్రశ్నలు చాలా హెచ్చుగానుండును కాబట్టి ప్రత్యుత్తరము చెప్పుటకు మంత్రులకు కూడా వానికి సంబంధించిన విషయసేకరణ అవసరముగాబట్టి యీ ప్రశ్నలను కొన్నిరోజులు ముందుగనే మంత్రులకు పంపెదరు. ఆ ప్రశ్నలను వరుససంఖ్య వేసి ప్రతిదినమును అచ్చువేయుదురు. ఆ అచ్చు కాగితము సభ్యుల యందరి ఎదుటను ఉంచబడినది. ఆ వరుస ప్రకారము ప్రశ్నవచ్చు రోజున అధ్యక్షుడు సభ్యునియొక్క పేరు చదువును. ప్రశ్నయంతయు చదివినయెడల కాలము వ్యర్థ మగును కాన ఆ సభ్యుడు ఆ ప్రశ్న యొక్క సంఖ్య మాత్రమే పైకి చదువును. మంత్రి దానికి ప్రత్యుత్తరము చెప్పును."

"అసలు సభ్యులు ప్రశ్నలు ఎందుకు వేయవలెను?"

"సభ్యులు ప్రజల యొక్క ప్రతినిధులు. ప్రజలయొక్క కోరికల ననుసరించి వారి క్షేమలాభముల కొరకు ప్రభుత్వము కార్యకలాపములు చేయవలెను. సభ్యులు ఈ విధముగ ప్రశ్నలు వేయుటవలన అందరి ప్రజలకు తెలియు విధమున మంత్రులు ప్రత్యుత్తరముల మూలముగా జరిగెడి విషయములను వెల్లడి చేతురు. ఒక్కొక్కప్పుడు ప్రమాదకరమైన తప్పులు ఈ ప్రశ్నల మూలముగా తెలుసుకొనబడి వానిని చక్క జేయుటకు ప్రభుత్వ మునకు అవకాశము కలుగును."

"ఈ సభయందు సభ్యు లెంతమంది కలరు ?" యని లీల అడిగెను.

"ఈ సభలో 500 మంది యుండుటకు ఏర్పాటున్నది. అయితే ప్రస్తుతము 499 మంది యున్నారు."

"వీరందరును ఎన్నికలవలన వచ్చినవారేనా ?"

"అవును. 500 మంది 5 సంవత్సరములకు ఒకపర్యాయం దేశమునందు జరుగు ఎన్నికలమూలమున ప్రత్యక్షముగా ప్రజలచే నెన్నుకొనబడి వచ్చెదరు."

"అదిగో ! మన ప్రధానమంత్రి పండిట్ జవాహర్‌లాల్ నెహ్రూ !" అని శేఖరు మొదటి వరుసలోనున్న మంత్రిమండలి స్థలములవైపు చూపించి యనెను.

నారాయణసతి "ఆయనయే ఈ సభానాయకుడు. ఏదియో ముఖ్యమైన తీర్మానమును ప్రతిపాదించుచున్నాడు."

"సభకు నాయకు డెందుకుండవలెను? ఈసభకు అధ్యక్షులే పెద్దగదా?" యని శేఖరు అడిగెను.

"అవును. కాని అధ్యక్షుడు మధ్యవర్తి. సభయందు అనేకమైన రాజకీయపక్షములు (Parties) ఉండును. ప్రతిపక్షమునకును ఒకనాయకు డుండును. ఇందులో అన్నిటికన్న పెద్దపక్షము యొక్క నాయకుడు సభానాయకత్వము వహించును. సభలో జరుగు ముఖ్యకార్యము లన్నింటియందును ఆయన పాల్గొనును. సభయందు జరుగవలసిన కార్యక్రమమంతయు ఆయన సలహా పైనే అధ్యక్షుడు నిర్ణయము చేయును."

"మరి యితరపక్షముల నాయకులమాట ఏమిటి ?" అని శేఖరు అడిగెను.

"సాధారణముగా నాయకునిపక్షము తర్వాత పెద్ద పక్షము ఏదిగలదో దాని నాయకుడు ప్రతిపక్షనాయకుడని పిలువబడును. ప్రభుత్వముయొక్క కార్యకలాపము పరిశీలించుచు తగిన విమర్శచేయుట ప్రతిపక్షముయొక్క విధి. అవసరమైనపుడు ప్రభుత్వము ఎడల సభకు విశ్వాసము పోయినపుడు ఈ ప్రతిపక్షము ప్రభుత్వముచేయు బాధ్యత స్వీకరించుటకు తగిన బలముతో నుండవలెను."

"ఈ సభయందు ప్రతిపక్షము యొక్క పేరు ఏమి ?"

"ప్రతిపక్షము అని పిలువబడు పక్ష మొకటియును ప్రస్తుతము లేదు. ప్రభుత్వమునకు ఎదురుగనున్న పక్షములలో నొక్కటియు ప్రతిపక్షమనిపించుకొనదగిన బలముతో లేవు!!"

"వారిప్పుడు ఏమి చర్చ జరుపుచున్నా"రని శేఖరు అడిగెను. అతనికి అక్కడ జరుగు చర్చ ఏమియు నర్థము కాలేదు.

"వారిప్పుడొక వాయిదా తీర్మానమును చర్చ వేయుచున్నారు. ఒక పెద్ద రైలుప్రమాదము గాని, దొమ్మి దెబ్బలాట వంటిదిగాని ఎక్కడనో జరిగినదనుకొందము. ఆ రోజు కార్యక్రమములో దానివిషయము లేదనికూడ అనుకొందము. కాని అది అవసరమైనదనియు, సార్వజనికమైన ప్రాముఖ్యము గలదనియు ఏ సభ్యుడైనను అభిప్రాయపడిన యెడల మిగిలిన కార్యక్రమమును వాయిదావేసి యీ విషయమును చర్చించవలసినదని

తీర్మానము ప్రవేశపెట్టుటకు అతనికి హక్కు కలదు. అట్టి తీర్మానమును వాయిదా తీర్మానమందురు. ప్రశ్నోత్తరముల కేర్పరచిన కాలము ముగిసినవెంటనే వాయిదా తీర్మానము ప్రతిపాదించుటకు సభయొక్క అనుమతి కోరవచ్చును. సభ అనుమతి యిచ్చినట్లైన మామూలు కార్యక్రమము కొంత తగ్గించి ఇతడు ప్రతిపాదించిన విషయము చర్చకు తీసికొనివత్తురు. ఇప్పుడు అక్కడ జరుగుచున్నది అటువంటి విషయమే. వాయిదా తీర్మానమునకు అనుమతి నివ్వవలెనా లేదా అని చర్చ జరుగుచున్నది."

"ఇదిఏమో సరిగా అర్థము కాకున్నది." అని శేఖరు అనెను.

"అవును. చాలమంది సభ్యులకే వారు క్రొత్తగ వచ్చినపుడు ఈ విషయములు అర్థముకావు. కొంత కాలముపాటు చూచి అనుభవము సంపాదించిన పిమ్మటనే యిట్టి వివరములు తెలుసుకొనగలరు."

"ఇన్ని పద్ధతులు ఎందుకుండవలెను?" అని లీల అడిగెను.

"అవును. లేకపోయిన సభయందు క్రమముండదు. కార్యక్రమమంతయు కలగాపులగముగ కలిసిపోవును. క్రమబద్ధముగా చర్చ జరుపుటకే ఇన్ని పద్ధతులు అవసరము. సక్రమముగా నీ పద్ధతులు నడుచునట్లు చూచుబాధ్యత అధ్యక్షునిపైనున్నది."

"నేను శాసనసభ్యులనిన గొప్ప హక్కు, స్వేచ్ఛలు గలవారని ఇంతవరకు అనుకొంటిని. బడిపిల్లలకున్న నిర్బంధ

ములవలె వీరిపై నికూడ ఎన్ని నిర్బంధములున్నవి?"యని శేఖరు అనెను.

నారాయణ నవ్వుతూ "నిజమే, బడిగదియందు నిర్బంధ పద్ధతివలెనే యిక్కడకూడ కొన్ని నిర్బంధములున్నవి. ఉదాహరణకు చెప్పెదను. సభామందిరము ప్రవేశించునపుడు ప్రతి రోజును వసారాలో హాజరురిజిష్టరులో సభ్యులు తమ సంతకములను చేయవలెను. లోపలకు వెళ్ళినపుడు వారెవరో తెలియ జేయుటకుగాను వారి ఐడెంటిటీ కార్డునుకూడ తమదగ్గర నుంచుకొనవలెను. లేకున్న ఒకప్పుడు అక్కడనున్న పోలీసు సిబ్బంది వీరెవరో తెలియనికారణమున వీరు లోనికిపోకుండ అడ్డుపెట్టినను అడ్డుపెట్టవచ్చును. సభ్యులుకానివారు లోనికి రాకుండా ఆపుచేయుట వారి విధి. ఇంకను సభలో అధ్యక్షులు ప్రవేశించునపుడు యావన్మంది సభ్యులు తమచోటులలో లేచి నిలిచియుండవలెను. సభలో ప్రవేశించునపుడు, వెళ్ళునపుడు గూడ అధ్యక్షునివైపు తిరిగి వందనపూర్వకముగా వంగి వందనము చేయవలెను. ఒకసభ్యుడు మాట్లాడునపుడు ఆసభ్యునికిని అధ్యక్షునికి మధ్యగా మరి యే సభ్యుడును వెళ్ళరాదు. సభ జరుగు సమయములో సభ్యులు వారిలోవారు గట్టిగ మాటలాడుకొనరాదు. సభామందిరములో సభజరుగునప్పుడు, దిన, వార, సాంవత్సరిక పత్రికలు వారు చదువరాదు. సభయందు జరుగుచున్న కార్యక్రమమునకు సంబంధించిన పుస్తకములనుమాత్రమే చదువవచ్చును. సభయందు ఉపన్యసింపదలచిన సభ్యుడు తానున్న స్థలముననే నిలిచి అధ్యక్షునియొక్క దృష్టిలోనికి పడవలెను.

అపుడు అధ్యక్షుడు మాట్లాడవచ్చునని చెప్పిన తా నుపన్యా సము మొదలిడవచ్చును. అధ్యక్షుడు మాటలాడుచున్న సమ యములో సభ్యులెవ్వరునూ నిలిచియుండుటకుగాని, సభామంది రమునుండి వెడలుటకుగాని వీలులేదు. 60 రోజులకన్న హెచ్చు కాలము సభకు హాజరుకాక యుండవలెననిన సంసత్ యొక్క అనుమతిని పొందవలెను."

"ఇదంతయు చాలా బాగుగ నున్నది. నాన్నగారుకూడ ఒకబడిపిల్లవాడే నన్నమాట" అని లీల కిచకిచలాడుతూ నవ్వి అన్నది. నారాయణసతి "అవును. నడివయస్సులోనున్న బడి పిల్లవాండ్రు" అని హాస్యముగ ననినది. ఆమాట విని నారా యణకూడా సంతోషించి ఇట్లనిరి : "అయినను మేము సభ్యు లము, మాకు తోచినట్లు సభలో మాట్లాడుటకు మాకు సంపూర్ణ మైన స్వేచ్ఛకలదు. ఏ విషయమునుగురించియైనను సరియే, మేము విమర్శించగలము. పరిపాలనా సంబంధమైనవారి నెవరి నైనను సరియే, జంకుగొంకులేక విమర్శించవచ్చును."

సభయందు సభానాయకుడు ఇంతలో ఏదో ముఖ్యమైన తీర్మానమొకటి ప్రతిపాదించి ఉపన్యాస ముపక్రమించుటకు సిద్ధ ముగ నుండెను.

"తీర్మానము (Resolution) అనగా ఏమి ?" అని శేఖరు అడిగెను.

"సార్వజనిక ప్రాముఖ్యముకల ఏ విషయముపైనైనను సభవారి సలహాకాని అభిప్రాయములుగాని తీర్మానమని పిలువ బడును. అట్టి తీర్మానమును సభ్యులెవరైనను ప్రతిపాదించిన

పిమ్మట దానిపై చర్చ జరుగును. చర్చపైన సభయొక్క అంగీ కారమునకై, అధ్యక్షుడు వోటుకు పెట్టును. సభ అంగీకార మునుగాని వ్యతిరేకమునుగాని తెల్పును." అని నారాయణపతి శేఖరునకు బోధపరచెను. మరికొంతకాలమైన తరువాత రాష్ట్రపతికి పార్లమెంటుయొక్క కృతజ్ఞతను తెల్పు తీర్మానముపై చర్చ జరుగుట ప్రారంభమయ్యెను. ఒక సభ్యుడు రాష్ట్రపతి పార్లమెంటులో చేసిన ఉపన్యాసమునకు కృతజ్ఞతను ఈ సభ వారు తెలియజేయుచున్నారని ఒక తీర్మానమును ప్రవేశ పెట్టెను.

"ఇదంతా ఏమిటి ?" అని శేఖరు అడిగెను.

"దీనిని కృతజ్ఞతా తీర్మానము-మోషన్ ఆఫ్ థాంక్స్ (Motion of thanks) అని అనెదరు. ఏ విషయమైనను తీర్మాన రూపముననే పార్లమెంటులో ప్రవేశపెట్టబడుచుండును. తీర్మానము ప్రతిపాదించుటకు నోటీసు ఇచ్చిన సదస్యుడు (సభ్యుడు) ప్రారంభ ఉపన్యాసము చేయును. దానిని అధ్యక్షుడు సభయందు చర్చకు పెట్టును. అప్పుడు చాలామంది సభ్యులు ఆవిషయమై ఉపన్యసింతురు. చర్చ సాంతమైన పిమ్మట అధ్యక్షుడు ఆతీర్మానముపైన సభ్యులను "మీ యభిప్రాయమేమి?" యని యడుగును. సభ్యులు అప్పుడు దాని కనుకూలముగనో ప్రతికూలముగనో తమ వోటు నిచ్చెదరు."

"కృతజ్ఞతా తీర్మానమనగా నేమి ?" అని లీల అడిగెను.

"నిన్నటి దినమున రాష్ట్రపతి పార్లమెంటులో నుపన్య సించెను కదా? అట్టి ఉపన్యాసము చేసినందుకు పార్లమెంటుసభ

తమ కృతజ్ఞతను రాష్ట్రపతికి తెలియజేయవలెను. అట్లు తెలియ జేయుట ఈ తీర్మానముద్వారా జరుగును. అందుచేత కృతజ్ఞతా తీర్మానమని దానిని అందురు.

ఒక సభ్యుడు ఆ తీర్మానము ప్రతిపాదించును; అప్పుడు రెండు మూడు దినములు దానిపైన చర్చజరుగును. పార్లమెంటు కార్యక్రమము ఆరంభ మగునపుడు ప్రభుత్వమువారు చేయ బోవు కార్యకలాపముల గురించి సభ్యులకు తమ యభిప్రాయ ములను తెల్పుటకు ఈ కృతజ్ఞతా తీర్మానపు చర్చ అవకాశ మిచ్చును. చర్చ అయిన పిమ్మట ఈ కృతజ్ఞత రాష్ట్రపతికి అధికారపూర్వకముగా అందజేయబడును."

"అక్కడ ఎదురుగా దూరముగా వ్రాసుకొనుచున్న వారెవరు?" అని అధ్యక్షుని కుర్చీకి పైభాగముననున్న పత్రికా విలేఖరుల స్థలమువైపు చూపించుచు లీల అడిగెను.

"వారు పత్రికా ప్రతినిధులు. ప్రతిదినమును పత్రికలలో పార్లమెంటులో జరుగు చర్చల నివేదికలు ప్రకటింపబడును. అన్ని పత్రికలు తమ ప్రతినిధులను పంపును. వారు చర్చలు జరుగుచున్నపుడు హాజరుగానుండి వానిని వ్రాసుకొని ప్రకటించుటకై వార్తా పత్రికలకు పంపుదురు."

"పార్లమెంటులో జరుగు కార్యక్రమము పత్రికలలో ఎందుకు అచ్చుకావలెను?"

"సభలోలేని జనసామాన్యమువారందరును సర్వాధి కారములుగల ప్రజాప్రతినిధుల సభయందు ఎట్టికార్యక్రమము జరుగుచున్నదో తెలిసికొనుటకు కుతూహలముగ నుందురు.

జనసామాన్యమే దేశముయొక్క పరిపాలకులు. అందుచేత సభయందు ఏమిజరుగుచున్నదో తెలుసుకొనుట వారియొక్క హక్కు."

"అయితే పత్రికలు ప్రజలకు గొప్ప ఉపకారము చేయు చున్నవన్నమాట." అని శేఖరు అనెను.

"కార్యదర్శియొక్క బల్లదగ్గర కూడ కొంతమంది కూర్చుండి ఏదో వ్రాయుచున్నారు" అని లీల వారివైపు చూపించెను.

"వారు పార్లమెంటులో జరిగిన విషయములను అధికార పూర్వకముగా వ్రాసుకొనువారు. జరిగిన కార్యక్రమమంతయు ను, చ, తప్పక వ్రాసుకొనుటకు వారిని పార్లమెంటు నియ మించును. వారు వ్రాసినవి పార్లమెంటుయొక్క అధికార పూర్వకమైన ప్రచురణమునందు గ్రంథస్థమగును." అనినారాయణ సతి లీలకు చెప్పెను.

ప్రకరణము 9

## పార్లమెంటు కార్యక్రమము-II

మరునాడు నారాయణగారు కుటుంబము కలిసి రాజ్య సభకు వెళ్ళిరి. ఈ సభామందిరముకూడా లోకసభా మందిరము యొక్క ఆకార ప్రమాణము, స్వరూపము, ఏర్పాట్లు కల్గినదే. వీరు వెళ్ళునప్పటికి కార్యక్రమము అప్పటికే ఆరంభమయి యుండెను.

"ఈ సభయందు ఎంతమంది సభ్యులు గల"రని శేఖరు అడిగెను.

"ఇప్పుడు 219 మంది గలరు. ఈ సభలో సభ్యుల గరిష్ఠసంఖ్య లోకసభ సభ్యుల సంఖ్యలో సగ"మని నారాయణ గారు చెప్పిరి.

"వీరినికూడ ప్రజలే ఎన్నుకొనిరా ?"

"కాదు. కొంతమందియే యిందులో ఎన్నికలవలన వచ్చినవారు. కళలయందు, సారస్వతమందు, విజ్ఞాన సాంఘిక శాస్త్రములయందు నారితేరిన శ్రేష్ఠులగువారిని 12 మందిని రాష్ట్రపతి నియామకము చేయును. మిగిలినవారు పరోక్షపు ఎన్నికపై ఎన్నుకొనబడుదురు. అనగా రాజ్యములలో గల శాసన సభలు వీరిని రాజ్యసభకు ప్రతినిధులుగా ఎన్నుకొని

పంపుదురు. శాసన సభలు ఎన్నుకొను సంఖ్య కూడా నియమితమైనదే."

"వీరు కూడ 5 సంవత్సరముల వరకును సభ్యులుగ నుందురా ?"

"లేదు. రాజ్యసభ శాశ్వతమైన సంస్థ. దీనిని ఎన్నడును విలయనము చేయరు. కాని రెండు సంవత్సరముల కొకమారు సభ్యులలో మూడవవంతు విరమింతురు. వారి స్థానములో ఎన్నికలుగాని, నియామకములుగాని జరుగుచుండును."

అప్పుడే ఒక బిల్లు లేక చిత్తు చట్టమునుగూర్చి చర్చ చేయుట యారంభమాయెను.

"బిల్లు లేక చిత్తుచట్టము అనగా నేమి ?" అని లీల అడిగెను.

నారాయణ "పార్లమెంటుయొక్క ముఖ్యవిధి శాసన నిర్మాణము. అనగా పరిపాలనకొరకును ప్రజలక్షేమముకొరకును అనుకూలమైన న్యాయ శాసనములు చేయుటయని మీకు తెలుసును. ఇంతియేకాక దేశముయొక్క బడ్జటు లేక ఆయవ్యయ పట్టికను ఆమోదించి సంవత్సరమునకు సరిపోవు మొత్తమును ప్రభుత్వమునకు కేటాయింపు చేయవలెను. ఖర్చుకు అవసరమైన ధనము రాబట్టుటకు పన్నులనుకూడ వేయుట పార్లమెంటు యొక్క విధాయకము. ఇందు నిమిత్తమై చర్చకు తేబడిన శాసనపు ముసాయిదాలను బిల్లులని అందురు. ప్రతిబిల్లు సభలో ముమ్మారు చదువబడును. అనగా మూడు పర్యాయములు మూడువిధములుగా చర్చసాగును. మొదటి పర్యాయము

మంత్రి ఆబిల్లు ప్రతిపాదనచేయుటకు సభ అనుమతి అడిగినప్పుడు చర్చజరుగును. అనగా అది మొదటిమారు చదువుటయందురు. అధ్యక్షుడు ప్రతిపాదనకు అంగీకారము కలదా లేదా యని సభను అడుగును. ఎవ్వరును ప్రతికూలముగ మాట్లాడనప్పుడును అనుకూలము గా నున్న వారి సంఖ్య హెచ్చుగ నున్న పుడును సభ యొక్క అనుమతి కలదని ఆయన చెప్పును. అప్పుడు ఆబిల్లు ప్రతిపాదించువారు ఆబిల్లును ప్రతిపాదింతురు. ఈ సమయమున బిల్లు (ముసాయిదా శాసనము) యొక్క శీర్షికయే చదువ బడును. ఇదియే శాసనపు ముసాయిదాయొక్క ప్రథమపఠన మనబడును. ద్వితీయ పఠనమున ఈముసాయిదా శాసనమునందు గల ముఖ్యమైన ఖండములు క్లాజుల, (clauses సబ్ క్లాజుల), యొక్క చర్చ జరుగును. సభ్యులకు ఆశాసనపు ముసాయిదా నచ్చని పక్షమున వారు దానికి వ్యతిరేకించవచ్చును. లేదా ఈ చట్టమును వివరముగా ఆలోచించుటకు ప్రత్యేకముగా ఒక ఉప సంఘమునకు పంపవలసినదని ప్రతిపాదించవచ్చును. అదియు గానిచో లోకసభ రాజ్యసభలనుండి ఎంచుకొనబడిన సభ్యులుగల ఒక జాయింటు సబ్ కమిటీ లేక ప్రత్యేక ఉపసంఘము ఎదుట ఈ ముసాయిదా పెట్టవలసినదిగా ప్రతిపాదించవచ్చును. లేదా ప్రజలందరి యభిప్రాయము తెలుసుకొనుటకై ఈ ముసాయి దాను ప్రకటించవలసినదని కూడా తీర్మానించవచ్చును. ఈ శాసనములోగల ముఖ్యసూత్రములు ప్రజలకు నష్టదాయక మైనను లేదా అందున్న నియమములు ప్రజల యవసరములకు సరిపోవును అను కారణము చేతనైనను ఇంతకన్న సమగ్రమైన

శాసనమవసరమను కారణముచేతనైనను లేకున్న ఇటువంటి శాసనము చేయుటకు ఇది తరుణము కాదను కారణముననైనను అటువంటి ప్రతిపాదనలను సభ్యులు చేయవచ్చును. చర్చముగిసిన పిమ్మట అధ్యక్షుడు సభయొక్క అభిమతము తెలుపువోటు తీసుకొనును. బహుసంఖ్యాకులు వ్యతిరేకించిన యెడల ఆశాసనము ఆపివేయబడును."

"ప్రత్యేక ఉపసంఘమునకు గాని, ప్రజల అభిప్రాయమునకుగాని శాసనము యొక్క ముసాయిదాను ఎందుకు పంపవలెను?" అని శేఖరు అడిగెను.

"వివరములను సంపూర్ణముగా ఆలోచించిన బాగుండునని కొంతమంది సభ్యులు అనుకొనవచ్చును. అట్టి ఆలోచనకు చిన్న ఉపసంఘమైన హెచ్చు అవకాశముండు"నని నారాయణ గారు చెప్పిరి. "లేకున్నచో చేయదలచిన శాసనము చాలా ముఖ్యమైనది గనుక సార్వజనిక అభిప్రాయము ముందుగా తెలుసుకొనుట యవసరమని తోచవచ్చును."

"ప్రతిపాదనచేసినవారి ప్రతిపాదన కాక మరియొకటి సభయొక్క యంగీకారము పొందిన ఏమగును?" అని నారాయణ సతి యడిగెను.

"ప్రత్యేకపు విచారణసంఘమునకు ఈ చిత్తుచట్టము పంపబడినయెడల ఆ ఉపసంఘము ఆ బిల్లునందుగల అన్ని వివరములను ఆలోచించి పార్లమెంటుకు నివేదికను సమర్పించును. లేదా సార్వజనిక అభిప్రాయమునకే పంపవలసినదని యా ప్రతిపాదన అయిన యెడల జనసామాన్యమునుండి వచ్చిన

యభిప్రాయములను సంపుటీకరణముచేసి సభ్యులకు అంద జేయుదురు."

"అనగా శాసనములు చేయుటయందు ప్రజలకుగూడా ప్రసక్తి కలదన్నమాట" అని శేఖరు తనకు నచ్చినదన్న మోస్తరుగా అనెను.

"అవును. పిమ్మట సభలో ముసాయిదాలోగల ఖండములు లేక క్లాజులు అన్నియు ఒకదాని తరువాత నొకటి చర్చ చేయబడును. ప్రతి ఖండమున కాఖండము వేరుగా ఉండును. వరుస సంఖ్యలలో అచ్చువేయబడి యుండును. ఏ ఖండమునకైనను సభ్యులు సవరణలను ప్రతిపాదింపవచ్చును."

"సవరణ అనగా నేమి ?" అని లీల అడిగెను.

"ప్రతిపాదనలోగల ఖండములకు పదియైన మార్పుచేయ దలచిన ప్రతిపాదనను సవరణ యందురు. అట్టి మార్పు కేవలము భాషకు సంబంధించినదయినను, లేదా ఆ ఖండములోగల సూత్రమునుగాని మాటలనుగాని మార్చునదైన గావచ్చును. అట్టి మార్పును సభ యంగీకరించినయెడల ఆ ఖండము తదను గుణముగా సవరణచేయబడును. ఆవిధముగఖండములన్నియును, చిత్తు చట్టముయొక్క శీర్షికయునుచర్చింపబడి, ఆమోదముపొందినఖండములతోపాటు ద్వితీయ పఠనమునుపొంది శీర్షికతోసహా ఆమోదించబడును. పిమ్మట తృతీయపఠన మారంభమగును. ఈచిత్తుచట్టమునుసభవారు ఆమోదించవలసినదని ప్రతిపాదనజరుగును. ఆ సమయమునజరుగు చర్చలో ఆ ముసాయిదా శాసనములో గల ముఖ్యసూత్రముల మంచిచెడ్డలను గురించిమాత్రమే చర్చింతురు.

చర్చ అనంతరము ముసాయిదాబిల్లు నంతయు ఏకముగనే వోటునకు పెట్టుదురు. సభలోగల బహు సంఖ్యాకులు అంగీక రించినపిమ్మట సభాధ్యక్షుడు శాసనముచేయబడెను, ఆమోదము పొందెనని (Passed) అని వక్కాణించును. అటులు చేయబడిన శాసనము చివరను అధ్యక్షుడు తన సంతకమును చేయును.

"ఆవిధముగా చేయబడిన శాసనము అమలులోనికి వెంటనే వచ్చునా ?" అని లీల అడిగెను.

"వెంటనే రాదు. అది అటుపిమ్మట రెండవ సభకు చర్చకై పంపబడును. అచ్చట కూడ మొదటి సభలో వలెనే మూడు పఠనములు జరుగును. ఈ విధముగా రెండు సభల యందును అనగా లోకసభ రాజ్యసభలయందు చేయబడిన శాసనము రాష్ట్రపతియొక్క అంగీకారమునకును చేవ్రాలు నకును పంపబడును. ఆవిధముగా రాష్ట్రపతియొక్క అంగీ కారము పొందినపిమ్మట ఆ శాసనము అమలులోనికి వచ్చును."

"ఈశాసనములయొక్క ప్రతిపాదనము మొదట ఏ సభలో చేయువలెను ?" అని శేఖరు అడిగెను.

"ఆర్థిక శాసనపు ముసాయిదా లేక ద్రవ్యసంబంధమైన చిత్తుచట్టమును మాత్రము లోకసభలోనే మొదట ప్రతిపాదించ వలెను. ఆర్థికశాసన మనగా పన్నులు వేయుటకు అధికారము గల బిల్లుగాని, ఖర్చుచేయుటకు నియమము లున్నదానినిగాని ఆర్థికశాసన మందురు. ఇతరమైన శాసన ముసాయిదాలను ఈ రెండింటిలో ఏ సభలోనైనను ప్రతిపాదన చేయవచ్చును" అని నారాయణ చెప్పెను.

"ప్రతి శాసనముకూడ రెండు సభలలోను ఏల ఆమోదము పొందవలెను ? ఒకసభ చర్చచేసి ఆమోదించినచాలదా ?" అని శేఖరు అడిగెను.

"శాసనము దేశములోగల ప్రజాబాహుళ్యముయొక్క జీవితమునకు సంబంధించినది కనుక చాలా ముఖ్యమైనది. జాగ్రత్తతో పరిశీలన కావలసిన విషయము. ఒకసభయందే చర్చ జరిగిన చాలునని యున్నయెడల ఒకప్పుడు తొందరపాటుగ అవసరమైనంత చర్చలేకుండగనే శాసనముచేయుటకు అవకాశముండును. రెండు సభలలో ఆలోచన జరుగునప్పుడు మొదటి సభలో చూడనటువంటి పొరపాటులు రెండవ సభలో సవరించుకొనుటకు అవకాశ ముండును. ఒకే సభయందు ఆలోచన సరిపోవునని చెప్పినచో ఒకప్పుడు ప్రజా హానికరమగు శాసనము ఆ సభయందు జరిగిన యడల దానిని నిరోధించి సవరించుటకు రెండవసభ లేకున్న వీలు కాదు."

ఇంతలో సభయందు చర్చ ముగిసెను. అధ్యక్షులు "సభకు అంగీకారము కాదా?" యని ప్రశ్న వేసెను. నారాయణ పిల్లలతో సభలో జరుగు కార్యక్రమము అప్పుడు సరిగా గమనించవలసినదని చెప్పెను. ప్రథమములో అధ్యక్షులు లేచి "ఈ శాసనము అంగీకారము పొందవలెనన్నది ప్రశ్న. అవునన్న వారందరును అవును అని అనుడు". అని కోరెను. దానిపైన అనేకమంది సభ్యులు "అవును-అవును" అని గట్టిగా అనిరి. పిమ్మట దీనికి అంగీకారము లేనివారు "కాదు" అనుడు అని అధ్యక్షుడు తిరిగి కోరెను. కొంతమంది సభ్యులు "కాదు

కాదు" అని గట్టిగ అనిరి. రెండు క్షణముల పిమ్మట అధ్యక్షుడు అవునన్నవారి సంఖ్య హెచ్చుగ నున్నదని అనెను. కొంతమంది సభ్యులు అధ్యక్షునియొక్క తీర్పువచనమును కాదు-కాదనిరి.

"ఏమి జరుగుచున్నది ?" అని శేఖరు అడిగెను.

"ఇది మాటతో వోటునిచ్చుట అనగా చర్చ ముగిసిన పిమ్మట హెచ్చుమంది అభిప్రాయము తెలుసుకొనుటకు అవునన్న వారియొక్కయు కాదన్నవారి యొక్కయు అభిప్రాయమును వేర్వేరుగా అడుగుదురు. అవును, కాదు మాటలయొక్క ధ్వని బాహుళ్యమును బట్టి అధ్యక్షుడు అవునన్నవారి సంఖ్య హెచ్చుగ నున్నదో కాదన్నవారి సంఖ్య హెచ్చుగనున్నదనియో తన మనసున నిర్ణయించుకొని చెప్పును. ఒకప్పుడు సంఖ్యాబలము తెలుసుకొనుటకు అవునన్నవారిని ఒకమారును కాదన్నవారిని మఱియొకమారును లేచి నిలువబడవలసినదనికూడా అధ్యక్షుడు కోరవచ్చును."

"మరికొంతమంది అధ్యక్షునియొక్క నిర్ణయమును కాదనుచున్నారే" అని శేఖరు అనెను.

"అవును ఇప్పుడు అధ్యక్షులు కాదన్నవారిని అవునన్న వారిని ప్రత్యేకముగా విభజించి వోట్లు లెక్కించుటకు ఉత్తరు విచ్చును. లేకున్న వారొకమారు వీరొకమారు లేచి నిలువబడ వలసినదని ఉత్తరు విచ్చినను ఇయ్యవచ్చును. ఏమి జరుగునో చూడుము."

అప్పుడు అధ్యక్షుడు "డివిజన్" అని ఇంగ్లీషులో ననెను, అనగా "వోట్ల లెక్కింపు విభజనము" అని దీని అర్థము,

వెంటనే రెండు నిమిషములవరకు ఒక గంట మ్రోగెను. ఆ గంట శబ్దము సభాభవనమంతయు వినబడును.

"ఆ గంట ఎందుకు కొట్టుచున్నా"రని లీల అడిగెను.

"సభలోలేని సభ్యులను లోపలకు రావలసినదని ఆగంట యొక్క అర్థము. చర్చ జరుగుచున్నపుడు కొంతమంది సభ్యులు పుస్తక భాండాగారమునకుగాని ఇతర కచ్చేరిగదులలోనికిగాని వెళ్ళియుందురు. అందరును వెంటనే లోపలికి రావలసినదని ఈ గంట తెలియజేయును. గంటఆగిన పిమ్మట సభాభవనము వసారాయొక్క తలుపులన్నియును మూసివేయబడును. వోట్ల లెక్కింపు విభజనము లేక డివిజన్ పూర్తియగువరకు వెలుపల నుండినవారు లోనకు రాకూడదు. లోపలనున్నవారు వెలుపలకు కూడ పోకూడదు."

అధ్యక్షుడు తిరిగి మరియొకసారి మతదానమునకై చెప్పి "అవుననువారు కుడివైపునకు వెళ్ళుడు. కాదనువారు ఎడమ వైపునకు వెళ్ళుడని ఉత్తర్వు చేసెను." కొంతమంది కుడివైపునకు కొంతమంది ఎడమవైపునకు ఆయన ఉత్తర్వు ప్రకారము వెళ్ళిరి. నారాయణ "అధ్యక్షునికి కుడిప్రక్కను ఎడమప్రక్కను ఉన్న రెండు ద్వారములును కన్పించుచున్నవా మీకు ?"

ఆ కుడివైపున ఉన్న ద్వారము అవునన్నవారు వెళ్ళవలసిన వసారాకు త్రోవ; ఎడమద్వారము కాదన్నవారు ఎడమ వసారాకు వెళ్ళవలసిన త్రోవ. రెండువైపుల సభ్యులపేర్లును డివిజనుసంఖ్యయుగల పట్టికలను చేతులందుంచుకొని వోట్లు లెక్కించు గుమస్తాలుందురు. ఒక్కొక్క సభ్యుడు ఆ గుమస్తాలను

దాటి లోపలికి వెళ్ళునపుడు తనయొక్క డివిజను సంఖ్యను చెప్పును. వెంటనే ఆసంఖ్యపై గుర్తుపెట్టుకొని ఆ సభ్యుని పేరు కూడ ఆ గుమాస్తా చదువును. అందరివోటులను ఆ విధముగా నమోదుచేసిన పిమ్మట రెండు భాగములలో నమోదైన ఈవోట్ల వివరణ పట్టికలను గుమాస్తాలు కార్యదర్శికి ఇచ్చివేయుదురు. కార్యదర్శి అవునన్న వోట్లు కాదన్నవోట్లు లెక్కించి రెండు మొత్తములను అధ్యక్షునికి అందించును. అధ్యక్షుడు రెండు సంఖ్యలను చూచి హెచ్చుసంఖ్య ప్రకారము శాసనము ప్రతిపాదన అంగీకారమైనదీ లేనిదీ పర్యవసానమును చెప్పును."

"ఒకప్పుడు అవునన్న సంఖ్య కాదన్న సంఖ్య సమానమైన ఏమగును ?" అని శేఖరు అడిగెను.

"ఆపక్షమున అధ్యక్షునికి ఒక "నిర్ణాయకవోటు" కలదు. ఆయన అవుననియో కాదనియో ఒక వోటును ఇవ్వవచ్చును. దీనిని ఆంగ్లములో 'కాస్టింగ్ ఓటు' లే అందురు. అనగా ఇరుపక్షములు సమానమైనపుడు ప్రతిష్ఠంభనము పరిష్కరించుటకు అధ్యక్షుడు వేసిన వోటు అని దాని అర్థము. అధ్యక్షునకు అటువంటి సమయములో మాత్రమే వోటుఇచ్చుటకు హక్కు గలదు.

"ఇదియంతయు చాలా బాగున్నది." అని శేఖరు చిరునవ్వుతో అనెను. జరిగిన ఈ రెండుమూడు దినములలో చూచిన దృశ్యములు, వినిన మాటలు, నేర్చిన సంగతులు అతనికి ఎంతయో సంతృప్తిని ఒక విధమైన గర్వమును కలుగజేసినవి.

"మన పార్లమెంటు విషయమై నీవిప్పటికి అనేకసంగతులు నేర్చుకొంటివి. మనయొక్క స్వాతంత్ర్యమునకు చిహ్నము ఈ సంసద్ (సభ). మరి యింటికి వెళ్ళుదమా" అని నారాయణ అనెను.

"నా స్నేహితులందరికిని యిక్కడ నే చూచినదంతయు తిరువనంతపురము వెళ్ళిన తర్వాతచెప్పెదను." అని లీలఅనెను.

"నేనుమాత్రము తిరిగి సంసత్ సభ్యునిగా ఇక్కడికే వత్తును." అని శేఖరు అనెను.

"నేనును అటుల చేతును."

మనసు ఫౌండేషన్

పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | RFH1202L183 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 27.7.2024 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 133 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | CI/2 |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | Lakshmi |
| పేజీలు విడదీసినది | Lakshmi |
| స్కాన్ చేసినది | Heena |
| పరీక్ష చేసినది | NANDHU |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | no |
| పరిస్థితి | good |